నవంబరు 1984

157

సృజన

బంగారుగుడి బంగారమైపోనూ !
ఐదునదుల గర్భశోకం మాటేమిటి ?
తీసుకున్న వేలాది ప్రాణాల్నికాక
తీసిన ఒక్క ప్రాణం కక్షు
మరిన్ని వేన వేలలో ఎందుకు ?

* * *

తామే శరీరమై తామే ప్రాణమైనవాళ్లు
రెప్పలూ, కనుపాపలూ తామే అయిన వాళ్లు
కంచెలూ చేలూ తామే అయి
కాపలాలు కాసి కోతల పాలైన వాళ్లు
వాళ్లు — నిజానికి అడగాల్సిందింక అడగనే లేదు
ఈ నేలలో ఎవ్వని స్వేదం ఎంత ఇంకిందో
ఈ నేలకోసం ఎవని రక్తం ఎంత చిందిందో
లెక్కదీసి పంచమని గాని
హక్కుదీసి పంచుకుంటామని గాని
వాళ్లు చేయాల్సింది అననుగూడా లేదు
వాళ్లు వాళ్లభూమి అడిగారు, నీళ్లు అడిగారు
కొంచెం స్వేచ్ఛ అడిగారు
అంతే...

# సృజన వద్ద అమ్మకానికి కొత్త పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | దున్నేవానికి భూమి లభించనిదే రైతాంగానికి విముక్తి లేదు! | 1=00 |
| 2. | సిక్కోలు యుద్ధం | 0=75 |
| 3. | వీధి భాగోతం | 0=25 |
| 4. | రగల్ జెండా (గోండు భాషలో పాటలు) | 1=50 |
| 5. | భారత ప్రజాస్వామిక విప్లవము జాతులసమస్య | 2=50 |
| 6. | సైన్యాన్ని ఉసిగొల్పి పంజాబ్‌లో రక్తప్రవాహాల్ని సృష్టించిన ఇందిరా ప్రభుత్వ ఫాసిస్టు దమనకాండను ముక్తకంఠంలో ఖండించండి. | 1=50 |
| 7. | మహారాష్ట్ర కొండకోనల్లో ఊపిర్లు పోసుకుంటున్న ఆదివాసి పోరాటాలు | 1=00 |
| 8. | రగల్ జెండా (బ్యాలే) | 1=25 |
| 9. | తరతరాలుగా సాగుతున్న వీరోచిత గిరిజన రైతాంగ పోరాటాలు | 2=00 |
| 10. | అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమం : ప్రపంచ సోషలిస్టు విప్లవపథం | 2=00 |
| 11. | ఏంచేయాలి? — వి. ఐ. లెనిన్ | 7=00 |
| 12. | విప్లవోద్యమంపై విషం కక్కుతున్న విద్యార్థి పరిషత్ ప్రచారాన్ని ఎండ గట్టండి. | 2=00 |
| 13. | ప్రజానాట్యమండలి జ్ఞాపకాలు — "కృష్ణ" (సృజన ప్రచురణ) | 2=00 |
| 14. | ఎన్నెలలో........భూపాల్ పాటలు — " | 3=00 |
| 15, | అన్నావచ్చిండు — (తెలుగుదేశం పాలనలో పౌరహక్కుల వార్షిక నివేదిక) APCLC ప్రచురణ | 1=00 |
| 16. | రామరాజ్యం — (గాంధీ చెప్పిన సత్యాహింసల నిజస్వరూపం) — యశ్‌పాల్, తెలుగు : ఆలూరి భుజంగరావు | 5=00 |
| 17. | సరోజదత్తా రచనలు — I (గాంధీ గురించి, సుభాష్‌బోసు గురించి) | 1=50 |
| 18. | " — II (వ్యాస సంకలనం) | 2=00 |
| 19. | అసంఘటిత పోరాటాలు (భారత పారిశ్రామిక రంగంలో అసంఘటిత కార్మికుల బతుకుపోరు) — స్వేచ్ఛాసాహితి | 1=50 |

(తరువాయి 3 వ కవరు పేజీ)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

157 | మాసపత్రిక | నవంబరు, 1984

సంపాదకీయం :




| | | |
|---|---|---|
| నిర్వహణ<br>సాహితీ మిత్రులు | సృజన<br>హనుమకొండ | సంవత్సర చందా రు. 20.<br>ఈ సంచిక రు. 2. |

SRJANA is commended for use in Public Libraries in the State by the Direct of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Nagendra Press, Vijayawada - 2
Venkataramana Mudranalayam, Warangal.

ప్రజలు ఎంతకాలం బాధల్ని సహించగలరు? దోపిడీ దౌర్జన్యాలను ప్రశ్నించకుండా భరించగలరు?

దేశంలోకల్లా సంపన్నమైన పశ్చిమగోదావరిజిల్లా పెదవేగి ఏరియాలో మూడువేల ఎకరాల బంజరు భూములున్నాయి. ఈ మూడువేల ఎకరాల బంజరు భూములను కూడ భూస్వాములు ఆక్రమించుకున్నారు. భూస్వాముల దురాక్రమణలో ఉన్న ఈ బంజరు భూములనుంచి వారిని బేదఖలు చేసి భూమి లేని నిరుపేదలకు అది పంచి ఇవ్వాలని పేద రైతాంగం, వ్యవసాయకూలీలు 15 సంవత్సరాలుగా నాయకత్వం వహించి కాలయాపనమాత్రమే చేసిందనుకుంటే పొరపాటు. మార్క్సిస్టు పార్టీ స్థానిక నాయకత్వం ప్రజలతో వేలాది రూపాయలు ఖర్చుపెట్టించి తాను భూస్వాములతో రాజీపడిపోయింది. నూటికి ఎనిమిది ఎకరాలు తనకు ఇచ్చే షరతు మీద భూస్వాములు ఈ భూములమీద దొంగసంతకం పుట్టించుకోవడానికి లిఖిత పూర్వకంగా హామీ ఇచ్చింది. నిజం తెలుసుకున్న పెదవేగి ఏరియా ప్రజానీకం రివిజనిస్టు నాయకత్వాన వదిలించుకొని తమకు అండగావచ్చిన రాడికల్ విద్యార్థి యువకులతో కలిసి రైతుకూలి సంఘాలు నిర్మించుకున్నారు. బంజరు స్వాధీనం చేసుకొని తమలో తాము పంచుకొని అందులో కొంత భాగాన్ని సాగులోకి తెచ్చారు.

భూమి మీద ప్రజలకు అధికారం రావడం అంటే ఉత్పత్తి శక్తుల మీద అధికారం రావడమే కాదు. ఉత్పత్తి సంబంధాల మీద అధికారం రావడం అంటే భూస్వామ్య పెత్తందారీతనం నశించి ప్రజలకు అధికారం రావడం. అయితే ప్రజలు భూస్వాములవలె ఈ అధికారాన్ని చలాయించరు. ప్రజాపరం చేస్తారు. పెదవేగి ఏరియాలోనూ అదే చేసారు. గ్రామ వ్యవహారాలన్నింటినీ యీ రోజు పెత్తందార్ల వద్దకు పోకుండా తమ సంఘం ద్వారానే పరిష్కరించుకుంటున్నారు. పీడిత ప్రజల మధ్య తగవులు లేవు. ఉన్నా అవి పెత్తందార్ల వద్దకు పోకుండా, తమ సంఘం ద్వారానే పరిష్కరింపబడుతున్నాయి. మండూరు గ్రామంలో పంచాయితీ చెరువులు భూస్వాముల స్వంత చెరువులుగా ఎట్లా మారిపోయాయని అడుగుతున్నారు. ఊరుమ్మడి సొమ్మంతా ఏమైంది అని అడుగుతున్నారు. పోరంబోకు భూములు భూస్వాముల ఆక్రమణలో ఎలా ఉన్నాయని అడుగుతున్నారు. పదేళ్ళ క్రితం భూస్వాముల ఆటలు సాగి ఆరని తగవులతో హత్యలు చేసుకున్న మాల మాదిగలు

ఇవ్వాళ ఐక్యం అయ్యే క్రమంలో వున్నారు. ఇందుకోసం రాడికల్స్ రాత్రి పాఠశాలలు నిర్వహిస్తున్నారు. పాటలు నేర్పుతున్నారు. పుస్తకాలు చదివిస్తున్నారు. ప్రజారాజకీయాలు ప్రచారమయ్యే సభలు సమావేశాలకు తీసుకుపోతున్నారు. పీడిత ప్రజలను సంఘాలలోకి సమీకరించి చైతన్యవంతులను చేస్తున్నారు. అన్నిటికి మించి భూస్వాములతో, పెత్తందార్లతో పోరాడుతున్న పీడిత ప్రజల మధ్యన వుంటున్నారు. దీనితో ఒక్కమాటలో పెత్తందార్ల సాంఘికపెత్తనం మొదలంటూ కదిలిపోయింది.

అంతదాక కడుపులో చల్ల కదలకుండా సారా వ్యాపారంలోకి, సినిమారంగంలోకి, కాంట్రాక్ట్ లైసెన్సుల్లోకి - వీటి గౌరవరూపం అయిన పార్లమెంటరీ రాజకీయాల్లోకి వేళ్ళు దన్నుకొని పచ్చగా వున్న భూస్వామ్యం కాళ్ళకింద మంటలు అలుముకున్నట్లు అదరిపడింది.

పెదవేగి ఉద్యమం చింతలపూడి తాలూకా కాళ్ళచెరువు ప్రాంతానికి అడవి భూములకోసం ఆందోళనగా విస్తృతమైంది.

భూస్వాములు గూండాల, పోలీసుల అండతో ప్రజలపై దాడులు ప్రారంభించారు. పశ్చిమ గోదావరిజిల్లా చరిత్రలోనే ప్రథమంగా పన్నెండు పోలీసు క్యాంపులు వచ్చినయి.

ఏలూరు తాలూకాలోని దెందులూరు, దిబ్బగూడెం, సీతాపురం, కొప్పులవారిగూడెం, ముండూరు మొదలైన గ్రామాలమీద రాత్రుళ్ళు, పగళ్ళు పోలీసులు దాడులు చేస్తున్నారు. భూస్వాములు పోలీసు వ్యాన్లలో తిరుగుతూ ఇల్లిల్లు తిరిగి కార్యకర్తలను పోలీసులకు పట్టిస్తున్నారు. భూస్వాములు, వారి బిడ్డలు, వారి కిరాయిగూండాలు కత్తులూ, గొడ్డళ్ళూ, బరిసెలు పట్టుకొని గ్రామాలన్నిటా పహారాలు తిరుగుతూ రైతుకూలీ సంఘం నాయకుణ్ణి చంపుతామని బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. గ్రామాలలోని పేదలమీద, దళితుల మీద వారి స్త్రీలమీద చెప్పనలవిగాని దౌర్జన్యాలకు పాల్పడుతున్నారు. సంఘానికి రాజీనామా చేసినట్లు బలవంతంగా సంతకాలు చేయించుకుంటున్నారు. రైతుకూలీ సభల సందర్భంగా ప్రచారం చేస్తున్న మహిళా కామ్రేడ్‌ను దిబ్బగూడెంలో భూస్వాముల తరఫున వచ్చిన ఒక గూండా "మీరంతా కంపెనీల నుండి వచ్చిన సరుకు, పాతిక రూపాయలిస్తే వస్తారు." అని అసభ్యంగా దుర్భాషలాడడంతో కోపోద్రిక్తులయిన ప్రజలు మే 23వ తేదీన ఆ గూండాకు దేహశుద్ధి

చేసారు. ఈ సంఘటనను సాకుగా తీసుకొని భూస్వాములు, వారి వద్ద వేలాది రూపాయలు లంచంగా తీసుకున్న పోలీసు అధికారులు ప్రజల మీద విచ్చలవిడి దౌర్జన్యకాండకు పూనుకున్నారు. మే 11వ తేదీన దెందులూరులో కా॥ కొల్లిపర వర్థంతి జరుపుతుండగా పోలీసులు ఇళ్ళమీద దాడులు చేసారు. రైతుకూలి సంఘం నాయకుని ఇల్లు చుట్టుముట్టి సోదా చేసారు. అతని ఇంటిలోని స్త్రీలను దుర్భాష లాడారు. మే 24 న 50 మంది పోలీసులతో రూరల్ సర్కిల్, టౌన్ సర్కిల్, నలుగురు ఎస్సైలు రెండు వ్యాన్లు, మూడు జీపుల్లోవచ్చి దిబ్బగూడెం, సీతారాంపురం గ్రామాల మీద దాడులుచేసారు. ఆ జీపుల్లో,వ్యానుల్లో భూస్వాములూ వారి కిరాయి గూండాలు కత్తులూ, గొడ్డళ్ళు బరిసెలతో ఉన్నారు. రైతుకూలీ సభలకు ప్రచారం చేస్తున్న కార్యకర్తలను వారికన్నం పెట్టిన వారిని గ్రామంలోని సామాన్య ప్రజానీకాన్నందనీ కొట్టి అరెస్టు చేసారు. స్త్రీలను, పురుషులను మండుటెండలో ఇసుకలో పడవేసి విపరీతంగా కొట్టి నానా బూతులు తిట్టి 21 మందిని పోలీసు వ్యానులో ఎక్కించారు. వారిలో ముగ్గురు బాలికలతో సహా, ఎనిమిదిమంది స్త్రీలమీద హత్యా ప్రయత్నం నేరం మోపారు. పోలీసు లాకపులో ఇప్పటికీ ఎంతమంది నెలల తరబడి అక్రమంగా ఉన్నారో రాస్తే అదొక పెద్ద జాబితా అవుతుంది. రైతుకూలీ సంఘం కార్యకర్తలను భూస్వాములు పోలీసులకు చూపిస్తారు. పోలీసులు తామైనా కొడతారు, గూండాలకైనా అప్పచెప్తారు. చెట్లకు కట్టి కొడ్తూ రైతుకూలీ సంఘానికి రాజీనామా ఇవ్వమంటారు. దిబ్బగూడెం గ్రామంలో ఇద్దరు స్త్రీలు దుకాణానికి వెళ్తే పట్టపగలు గూండాలు ఒకామె చీర లాగారు, మరొకామె జాకెట్ చింపారు. దిబ్బగూడెం, గంగన్నగూడెం మొ॥ చోట్ల బస్సులాపి సోదా చేస్తున్నారు. పెదవేగి బంజరు పోరాటాన్ని "బంజరు పెంజేరు" పోరాటమే అనుకొని బలపరచిన తెలుగుదేశం నాయకులు ఇప్పుడు రైతుకూలీసంఘం కార్యకర్తలను రాజీనామా చేయమని దౌర్జన్యం చేస్తున్నారు. ఉద్యోగస్థులను న్యాయమైన ఈ ఉద్యమాన్ని బలపరచినందుకు బెదిరిస్తున్నారు. వాళ్ళ స్త్రీలను మానభంగం చేస్తామని గ్రామ పెత్తందార్లు బెదిరించడమే కాదు రాత్రిళ్ళు ఇళ్ళ తలుపులు గుద్దుతున్నారు.

రైతుకూలీల మీద ఇప్పటికి పధ్నాలుగు కేసులు పెట్టారు. 200 మందికి పైగా ఈ ప్రజలను కేసుల్లో ఇరికించారు. వారిలో సగానికి స్త్రీలు, పిల్లలే ఉన్నారు.

(తరువాయి 59 వ పేజీలో)

# పోరు ప్రయాణం

అజ్ఞాత సూరీడు

ఎల్లిపోతుందీ — ఎల్లిపోతుందీ
ఎల్లిపోతుంది మాపోరు వూరువాడ దాటుకుంటు
వూరువాడ దాటుకుంటు దేశాన్ని చుట్టుముట్టి — ఎల్లి ॥

కూలినాలిని కూడగట్టి — ఎల్‌పోతంది మాపోరు
సంగాలను బెట్టుకుంటు - " "
ఎర్రజెండా పట్టుకొని — " "
గుండె నెత్తురు ధారపోస్తూ ఎల్‌పోతంది మాపోరు — ఎల్లి ॥

బంజర్లను దున్నుకుంటు — " "
పంచాయతుల్ చేసుకొంటు — " "
కూలిరేట్లను పెంచుకొంటు — " "
దండుగల్ గక్కించుకొంటు ఎల్‌పోతంది మాపోరు — ఎల్లి ॥

దొరల పనులు బందుబెట్టి — "
దోపిడీకి గోరికడుతూ — " "
అడుగు అంగగ మార్చుకుంటు - " "
మెట్టుపై మెట్టెక్కుకుంట - ఎల్‌పోతంది మాపోరు — ఎల్లి ॥

అదిలబాదు అడివిలోన — ఆడుతోంది మాపోరు
కరీంనగరు కళ్ళలోన — కదులుతోంది మాపోరు
సింగరేణి గనులలోన — మగ్గుతోంది మాపోరు
కాకతీయ పల్లెలంట పాకుతోంది మాపోరు. — ఎల్లి ॥

తూటాల్ దండేసుకొని — ఎల్‌పోతంది మాపోరు
తుపాకుల్ పట్టుకొని - " "
బాంబు సంచులు పట్టుకొని - " "
బాకు బరిసెలు పట్టుకొని ఎల్‌పోతంది మాపోరు — ఎల్లి ॥

మావో చూపిన బాటలోన - " "
చారుబాబు అడుగులంట - " "
సత్యమన్నను నెత్తినెట్టుకు - " "
శంకరన్న వూపిరందక ఎల్‌పోతంది మాపోరు — ఎల్లి ॥

చిక్కులొస్తే చెదరకుండా — ఎల్ పోతంది మాపోరు
బాధలొస్తే బెదరకుండా — " "
కష్టమొస్తే కుమలకుండా - " "
ఇబ్బందుల నెదుర్కుంటూ ఎల్ పోతంది మాపోరు —ఎల్లి॥
కష్టములు కడతేరుదాక — ఆగబోదు మాపోరు
పోరు ఓటమి విజయమంటూ - పోతుందీ మాపోరు
దోపిడంతంచేసెవర్కు — సాగుతుంది మాపోరు
ఎర్రకోటను పట్టువరకు ఎన్కదిరగదు మాపోరు —ఎల్లిపోతోంది

("ఎల్లిపోతంగీ — ఏల్లిపోతందీ ఎల్లిపోతందనసూర్య అన్న డ్రైవరమ్మటి". అనే పల్లెపాట బాణీలో పాడాలి.)

## చాలు ఈ దొరతనము

జనార్దన్

చాలో ఈ దొరతనము
అన్నన్న తిట్టుడు కొట్టుడు ఇంక మాకొద్దు —చాలో॥
కండలె పిండవగ — దుక్కులు దున్నాము
బొట్టు బొట్టుగనెత్తు - రిత్తులు చల్లాము
కంటికి రెప్పలా — పంటలు కాశాము
ఎన్నుముక ఇరగంగ -- వరిచేలు కోశాము
గంజికి గతిలేక — పస్తులు మేం వుంటె
పుర్లుమీద షర్లు సువ్వు గట్టావా ? —చాలో॥
ఎకరామ్ యాభయ్యి — ఎంచి పండుద్దంటె
కుంట కింద చేలోన — కురచ వరిని నాటి
ప్యాకేజి ప్రోగ్రాము[1] లో — పది బస్తాలెరువేస్తే
మొల ఎత్తు పైరంత — మోకాటికొచ్చింది
దోమ పోటంటేను — ఫిమ్మెట్టు చల్లాము
యాభై అన్న చేను — ఇరవై య్యి రాలితే
బస్తా ఎనభై చేసి — బజార్లో అమ్మేస్తే

ఎరువుల మందులలోను – ఇరవై వందలు మిగిలె
క్రాపులోను [2] కింద – కొంప జప్తన్నావా ? —చాలో॥
వప్పుల గంపతో – మావూరు వచ్చావు
దణ్ణాలెట్టుకొంటు – ధాన్యాలు కొన్నావు
పిల్లపెళ్ళికేమొ – పదివందలిచ్చావు
పండిన ప్రతి ఇత్తు – ప్రతి ఏడు తోలాము
పాతికొందలకేమొ - కోర్టు కెక్కించావు
ఇల్లు వాకిలి నువ్వు - వేలాము వేశావు
గూడులేనోడివి మేడగట్టావా ? —చాలో॥

సారా పాటపాడి - మావూరు వచ్చావు
సాలు [3] తిరిగేసరికి - సర్పంచువయ్యావు
లాడ్జి క్లబ్బులెట్టి – సమితికి ఎక్కావు
సిన్మాలు తీశావు – పరిషత్తుకెళ్ళావు
మందికొంపలుముంచి మంత్రివయ్యావా ? —చాలో॥

కూలి రైతులమంత – కూడి సంగంబెట్టి
బతుకు దెరువుకని – బంజర్లు నరకంగ
కర్నాని కొరైకి – లంచాలు గుప్పించి
సర్వేయరు జేబు – చక్కంగ నింపేసి
తాలూకాఫీసులో – తప్పీలు చేయించి
బంజరు భూమంత నీ బాబుదంటావా ? —చాలో॥

నీ మాయలు మోసాలు – ఇకమీద సాగవు
రాడికల్లన్నాలు – మా కండగున్నారు
కూడు లేనోళ్ళమె – కత్తుల మైనాము
బతుకు లేనోళ్ళమె – బల్లాల మైనాము
అలలాగ లేస్తాము నిను ముంచివేస్తాము —చాలో॥

1. సాంద్ర వ్యవసాయ పథకం ( Intensive Agricultural Development Programme — I.A.D.P ). ఫోర్డు ఫౌండేషన్ ఆధ్వర్యంలో అమలు జరుగుతున్న పథకం.
2. కో-ఆపరేటివ్ సొసైటీలు, షెడ్యూలు బ్యాంకులు పంట పండించటానికి వ్యవసాయదార్లకు ఇచ్చే షార్టుటెరమ్ అప్పు.
3. సంవత్సరం.

## పోరాటం

మట్టాకృష్ణమూర్తి

వ్యవసాయ కూలీలమన్నా
మనం వ్యవసాయ కూలీలమన్నా
మనగోడు వినరేమిటన్నా
మనం వ్యవసాయ కూలీలమన్నా ॥వ్యవ॥
పొద్దత్తమానమూ రన్నా
రెక్కలూ ముక్కలవురన్నా
కూలిడబ్బులు కూటికన్నా
పంగనామాల్ బెట్టురన్నా ॥వ్యవ॥
సూరన్న చంద్రన్నలన్నా
మనగూట్లో దీపాలురన్నా
వానల్లు వస్తాయిరన్నా
మనతలకడిగి పోతాయిరన్నా ॥వ్యవ॥
సెమటకూడుర మనకురన్నా
సెమ ధర్మమే లేదురన్నా
ఏడుగడ మనకేదిరన్నా
తిరగబడటమే మేలు రన్నా ॥వ్యవ॥
రైతుల్ని కూలోళ్ల నెల్లా
తెలివిగలవాళ్ల నందర్నీ
కలిసొచ్చు కష్టజీవుల్నీ
కలుపుకొద్దాము రోరన్నా ॥వ్యవ॥
కూడూగూడూ దొరుకునట్టి
కునుకు సుకమూ వుండునట్టి
కులమతపు గొడవలేనట్టి
సమరాజ్జెం తెద్దాంరన్నా ॥వ్యవ॥

# వెన్నెల వేడి

ప్రసాదరాజు

సంక్షోభ తరంగాల్లో చంద్రుణ్ణి చూశాను
ఇన్నాళ్ళు నాకిక్కడ చంద్రుడు
వెన్నెల తప్పతాగి పచార్లు చేస్తున్నట్లుండేవాడు
రోజూ రక్తపుకూడు తిని, పూటపూటా చెమటను షర్బత్ చేసుకొని
పాపం మేకల్లాంటి అమాయకుల్ని నారింజ తొక్కల్లా విసిరేసి
బ్రేవ్‌మని తేన్చే అద్దరు బొచ్చు కుక్కలా కన్పించేవాడు
కాని ఈ రోజు అక్కడ వెన్నెల వెలిగిస్తున్న
డాయ్‌నెట్ మొనలా, గన్‌బోర్‌లా చంద్రుడు
వెన్నెల ప్రవాహం గుండెల్ని ఒరుసుకు పోతుంటే (ప్రవహిస్తుంటే)
ఇంకెంత కాలం ఈ గాయాల్ని,
మధ్యతరగతి పటాటోపాన్ని, పెళ్ళాల్ని, బిడ్డల్ని, తల్లుల్ని,
వాళ్ళప్రేమని, స్వార్థాన్ని, శషభిషల్ని
గొలుసుకు కట్టేసిన కుక్కలా ఎంతకాలం ఈ గాయాల్ని గజ్జిపుండ్లని
నాక్కుంటూ కూర్చుంటాం.
అక్కడ వెన్నెల — ఇక్కడ వెన్నెల
మేఘాల మైదానం దాటి వెలిగిస్తున్న టార్చి లైటు చంద్రుడే గతితర్కం
మనమధ్య స్నేహానికి, అనుబంధానికి అన్నిటికీ వెన్నెలే ప్రమాణం
ఆకాశం ఏటిఒడ్డున మేఘాల తిప్పపై మెరుస్తున్న వెండిబిళ్ళ చంద్రుణ్ని
ఎట్ల ఒదిలేస్తాం.
అది అణుబాంబు, ఆణవబాంబు అని తెలిసాక
గుండె జేబులో ఎందుకు దాచుకోం.
ఆలోచనల బాణాలు ముందుకు దూసుకుపోతుంటే
ఇంకా ఎంతకాలం మొదలు నరికేసిన కాండం స్వార్థాన్ని కావలించు కోడం
నిర్బంధాన్ని తాగి త్యాగం వెన్నెల కారుస్తున్న అవుపొదుగు చంద్రుడు
సమస్త కష్టాలకి, దుఃఖాలకి, వంచనల ఏటికి ఎదురీదుతూ
ఉత్తేజాన్ని, వెన్నెలవెలుగుల్ని మొప్పలగుండా బయటికి పంపిస్తున్న
చేపకన్నులా చంద్రుడు
తెలంగాణా ఆకాశం అడివిలో

మేఘాల చెట్ల ఆకులపై కురిసిన వెన్నెల బొట్లు బొట్లుగా రాలుతుంటే
ప్రజల ఆకాంక్షల, ఆవేదనల్ని కావలించుకుంటే
ఎంతవేడి, ఎంతహాయి
పెనంపై చల్లిన నీటిబొట్టు కదా ఈ నిర్బంధం
వెన్నెల్ని ఇక్కడ అందర్ని కూచోబెట్టి తలో
గ్లాసు ఇచ్చి తాగించాను. వాళ్ళు వేడిగానే వుందన్నారు.

పాలస్తీనా కవిత

# నేను ప్రకటిస్తాను

మహమూద్ దార్విష్

నా భూమిలో జానెడు మందమైనా మిగిలి ఉన్నంతవరకూ
నాకు ఓ ఆలివ్ చెట్టూ
ఓ నిమ్మ చెట్టూ
ఓ బావీ, ఓ కాక్టస్ మొక్కా ఉన్నంతవరకూ
నాకు ఒకే ఒక్క జ్ఞాపకమైనా ఉన్నంతవరకూ
కొన్ని పుస్తకాలూ
మా తాత పటం ఒకటీ, ఓ గోడా
ఉన్నంత వరకూ
అరబిక్ మాటలు వెలువడుతున్నంతవరకూ
జానపద గీతాలు పాడబడుతున్నంతవరకూ
నా నేల మీద
కవిత్వం రాయబడుతున్నంతవరకూ
అంతర్—అల్—అబ్సె గాథలున్నంతవరకూ
పర్షియామీదా రోమ్‌మీదా చేసిన
యుద్ధాల ఇతిహాసాలున్నంతవరకూ
నాకు కళ్ళున్నంతవరకూ

నేను ప్రకటిస్తాను



పెదాలున్నంతవరకూ
చేతులున్నంతవరకూ
నేనంటూ ఉన్నంతవరకూ
శత్రువు ముఖం మీద
నేను ప్రకటిస్తాను !
విముక్తి కోసం
భీకరమైన పోరాటం ప్రకటిస్తాను.
కార్మికులూ విద్యార్థులూ కవులూ
ఎక్కడివారైనా స్వేచ్ఛాజీవులందరి పక్షాన
నేను ప్రకటిస్తాను
పిరికి పందలు—సూర్యుని శత్రువులు
అవమానాలనే కడుపార తిననీ
నేనంటూ ఉన్నంతవరకూ
నా మాటలు నిలిచి ఉంటాయి.
స్వేచ్ఛా సమరయోధుల చేతుల్లో
ఆహారంగా ఆయుధాలుగా
నా మాటలు నిలిచే ఉంటాయి.

కథనం :

# కృపాణ్

ఉషా. యస్. డాని

చెట్ల మీద పక్షుల కలకలం నెమ్మదిగా వినబడుతున్నది.

నా తలను నరికి అక్కడ పడేసినట్లుగావుంది. మిగతా శరీరం నా స్పృహలో లేదు. అది నాతలకు అతుక్కొనే వుందో, దాన్ని నరికేశారో తెలియడం లేదు.

"చచ్చిపోయానా?"

ఒక్కసారే భయంవేసింది. చచ్చిపోతే ఎలా ఆలోచిస్తాను అని అనుమానమూ వస్తున్నది. ఎండ కిటికీలో నుండి కళ్ళ మీదపడి చురుక్కు మంటున్నది. కొద్ది కొద్దిగా స్పృహ వస్తున్నది. చుట్టూ మందుల వాసన. నెమ్మదిగా కళ్ళు తెరవడానికి ప్రయత్నిస్తున్నాను.

ప్రపంచమంతా రక్తసిక్తమై పోయినట్లు నా కళ్ళముందు ఎర్రటి నెత్తురు. అది నాకోసం స్టాండుకు వేళ్ళాడదీసిన నెత్తురు సీసా అని అర్థం కావడానికి చాలా సేపు పట్టింది. ముఖానికి పట్టిన చెమట పెదాలను ఉప్పగా తాకుతున్నది. బతికే వున్నానన్నమాట. గెడ్డంతల వెంట్రుకలూ ముఖాన్ని కప్పేసి చిరాగ్గా వున్నాయి.

దూరంగా మిలటరీ ట్రక్కులు హడావిడిగా తిరుగుతున్న హోరు వినబడుతున్నది. ఆఫీసర్లు సైనికుల్ని చూసి అరుస్తున్నారు.

ఒక్కొక్క విషయం నెమ్మదిగా స్పృహలోనికి వస్తున్నవి. నేను మిలటరీ మెడికల్ రూంలో వున్నావన్న మాట.

"మరివాళ్ళేరి?" ఒక్కసారే కంగారు. అనుమానం. పక్క బెడ్లమీద వున్నారేమో. ఆతృతగా ప్రక్కకు తిరగ బోయాను. ఎడమ చేతికి గుచ్చి వుంచిన సూది కలుక్కుమంది. నరాలన్నీ గిలగిలా కొట్టుకున్నాయి. చాలాసేపు ఆ బాధను సహిస్తూ కళ్ళు మూసుకొని అలానే వుండిపోయాను.

నెమ్మదిగా నాప్రయత్నం ఫలించి ఎడమ వైపుకు తిరగగలిగాను. నాస్థితిలోనే ప్రక్క మంచం మీద బల్‌బార్‌సింగ్. అతని కళ్ళు నన్ను ఆతృతగా, ఆప్యాయంగా

చూస్తున్నాయి. అతని పెదవులు నెమ్మదిగా కదిలి వినిపించీ వినిపించనట్లు "రఘుబీర్" అన్నాయి. ఆ పిలుపు వినంగానే ఆనందంతో కేక వెయ్యాలనుంది. కానీ నాశక్తి చాలడంలేదు. నోటమాట రావడంలేదు.

బలాన్నంతా కూడ తీసుకొని "రిచ్‌పాల్ ఎలావున్నాడు ?" అని మాత్రం అడగగలిగాను. అతను జవాబు యివ్వలేదు, అతని కళ్ళు నిస్సహాయంగా శూన్యంలోనికి చూస్తున్నాయి. అవి నాలో అనుమానాల్ని రేపుతున్నాయి. ఆ అనుమానం నన్ను మరింత బలహీనుడ్ని చేస్తుంది.

"రిచ్‌పాల్‌ను చంపేశారా ? రిచ్‌పాల్ చచ్చిపోయాడా ? మరి ఉషాబేదీ సంగతేంటి ?" కూడదీసుకుంటున్న ఓపికంతా జారిపోతున్నది. స్పృహ కోల్పోతున్నాను.

* * *

నేను పంజాబీ యూనివర్శిటీ ఆఫ్ పాటియాలలో హిస్టరీలో యంఫిల్ చేస్తున్నాను. మాకు ఏప్రియల్ నెలలో పరీక్షలు జరగాలి. మేమంతా ఆ నెలకు హాస్టలు ఫీజులు కట్టేసి, పరీక్షల టైంటేబుల్‌కోసం ఎదురు చూస్తున్నాం.

రాష్ట్రంలో ఆందోళన రోజురోజుకూ తీవ్రం అవుతున్నది. కేంద్రం అంగ దండలతో హిందూ సురక్ష సమితి ఈ వుద్యమాన్ని దెబ్బతీయాలని తీవ్రంగానే ప్రయత్నాలు చేస్తున్నది. దేశమంతా శిక్కు వ్యతిరేక ప్రచారం భారీ ఎత్తున జరుగుతున్నది. పంజాబీయుల డిమాండ్లను మరుగుపరచి దీన్ని హిందూ శిక్కుల మత యుద్ధంగా మలచడంలో కేంద్రం విఫలమయ్యిందనే చెప్పాలి. భింద్రేన్‌వాలా చాదస్తం కూడా కొంతవరకు దానికి వుపయోగపడింది.

రాష్ట్రాన్ని కల్లోలిత ప్రాంతంగా ప్రకటించారు. టెర్రరిస్టు ఆక్టును ప్రవేశ పెట్టారు. ఎక్కడ చూసినా పోలీసు బలగాలూ, సిఆర్పీ బెటాలియన్లే. రోజూ మూకుమ్మడి హత్యలూ, పోలీసు కాల్పులూ తప్పడంలేదు.

ఏప్రియల్ మొదటివారంలోనే యూనివర్శిటీకి శెలవులు ప్రకటించారు. విద్యార్థులంతా హాస్టల్ ఖాళీచేసి తమతమ వూళ్లకు వెళ్ళిపోయారు. మళ్ళీ కలుస్తామో లేదో తెలియని అనుమానం, ఆందోళనల మధ్య వీడ్కోలు తీసుకున్నాం.

పూర్లో పరిస్థితి మరింత ఘోరంగావుంది. గిట్టుబాటుకాక వ్యవసాయం పూర్తిగా మూలబడిపోయింది. నాన్న చిక్కిశల్యమైపోయాడు. ప్రీత్‌పాల్ అన్నయ్యా అంతే. వదినకు టీబీ వచ్చేసింది. పిల్లల్ని చూస్తే నాకు నిజంగా ఏడ్పువచ్చినంత పనైంది.

"అంతంత ఖర్చులు పెట్టి యిక వ్యవసాయం చెయ్యలేంరా తమ్ముడూ" అన్నాడు అన్నయ్య.

"వ్యవసాయం చెయ్యకుండా ఎలాకుదురుద్దీ. భూమిని దున్నకుండా రైతు బతగ్గలడా ?" అన్నాడు నాన్న.

"ఎరువుల ధరలా మనచేతిలో లేవు. ట్రాక్టర్లూ, పంపుసెట్లూ యిక మనం భరించలేం. కాల్వవచ్చి కనీసం ఈ బోరింగ్ నీళ్ళ ఖర్చయినా తగ్గితే బావుంటుందని ఆశ" అన్నాడు అన్నయ్య.

అమ్మమాత్రం నిట్టూరుస్తూ "నామ్‌కో పంజాబ్. కిసాన్‌కో దాల్ రోటీభి దూర్ హోగయా" అంది.

ఈ విషయంలో వదిన అందనా బాగుంది. ఆమె "పానీ మాంగేతో పానిపట్ కా జంగ్ చల్‌తాహై" అంది.

అంతానిని "ఈసారైనా తాడోపేడో తేలిపోవాలి" నాన్న ఆవేశంగా అన్నాడు.

యిది మాయింటి సమస్యేకాదు. హరిత విప్లవం, రైతులందర్నీ హరించేసింది. ఎక్కడచూసినా యిదే ఆందోళన. మొత్తానికి ఏదో ప్రళయం రాకతప్పదని అందరూ అనుకుంటూనే వున్నారు.

ఆపరేషన్ బ్లూస్టార్ తన పంజా విప్పింది. జూన్ మొదటి వారంలో సైన్యం పంజాబ్‌లో ప్రవేశించింది. రాష్ట్రమంతా కరెంటు ఆగిపోయింది. రైళ్ళు, బస్సులు చివరకు జట్కాబళ్ళుకూడా తిరగడం మానేశాయి. టెలిఫోన్, టెలిగ్రాం సౌకర్యాలు అదృశ్యమైపోయాయి. పాలూ, కూరగాయలూ వంటి రోజువారీ అవసర సరుకుల సంగతి అటుంచి, పక్కింటివాళ్ళను పలకరించాలన్నా, కనీసం గుమ్మందాటి అడుగు బయటికి వేయాలన్న అవకాశంలేదు. కిటికీ తలుపు తెరిస్తే తుపాకీగుండు యింట్లోకి దూసుకొస్తుందని భయం. వీధులన్నీ సైన్యం పహారా కాస్తున్నది. మేం మన దేశంలోనే వున్నామో లేదో తెలియదు. అసలు ఈ భూమ్మీద వున్నామో లేదో తెలియదు. మమ్మల్ని ఈ దేశంనుండే కాదు. ఈ ప్రపంచం నుండే విడగొట్టేశారు. యిదంతా ఎందుకంటే మేం ఈ దేశంనుండి విడిపోవాలని అనుకుంటున్నామట.

యింట్లోవున్న గోధుమపిండితోనే సుక్కా రొట్టెలు చేసుకొని వుల్లిపాయ ముక్కా, పచ్చిమిర్చీ నంజుకుని తినేవాళ్ళం. నాన్న ఆ రొట్టెకూడా తినేవాడుకాదు. వేలు గురించి తెగ బాధపడిపోయేవాడు.

జూన్ ఆయిదు రాత్రి రానేవచ్చింది. సైన్యం స్వర్ణదేవాలయంలో ప్రవేశించింది. ఎంత మందిని చంపిందో యూనివర్శిటీకు తిరిగి వచ్చేవరకూ నాకు తెలీనే తెలీదు. ఆ ఒక్క రాత్రి సైన్యం పదకొండు వందలమందిని చంపింది. అయినా అది పంజాబ్‌ను వదలలేదు.

ఓరోజు సాయంత్రం ఓ యాభై మంది సైనికులు మాయింటిని చుట్టుముట్టారు. ఓ నలుగురు నాలుగు వైపులనుండీ మా యింట్లో ప్రవేశించారు. తీవ్రవాదులకోసం యిల్లంతా గాలించారు. గోధుమపిండిని నేలమీద బోర్లించి వెదికేరు. పాతపరుపును చింపి ఆయుధాలున్నాయేమోనని వెదికేరు. తందూర్ పొయ్యిని తలక్రిందులు చేసి వెదికేరు. మంచాలు, విరగొట్టి, కుండలు బద్దలుగొట్టి వెదికేరు. చివరకు అన్నయ్యను వాళ్ళతోపాటూ తీసుకెళ్ళిపోయారు. నాన్న అడ్డుపడితే భుజంమీద తుపాకీ మడంతో బలంగా గుద్దేరు. దాంతో ఆయన కాలుజారి అంతెత్తు మనిషి అరుచుకుంటూ కుప్పలా కూలిపోయాడు. ఆ పెనుగులాటలో వదిన స్పృహ కోల్పోయింది. పిల్లలు భయపడిపోయి ఒకటే ఏడ్పు. నేను అడ్డుపడాలనుకున్నాను గానీ మా అమ్మ నన్ను ప్రక్కకు లాగేసింది. ఆ రోజు అలా మా వీధిలోనుండి ఓ యాభై మందిని తీసుకువెళ్ళిపోయారు. అందులో కొందరు ఆడపిల్లలూ వున్నారు. దీన్నే కార్డ్ అండ్ సెర్చ్ పద్ధతి అంటారంట.

రాపిడీ జరిగిజరిగి చర్మం మొద్దుబారిపోతుందంటారు. రెండు నెలలుగా యిలాంటి విషయాలే ఎన్నోసార్లు విన్నా ఆ సంఘటన గుర్తుకొస్తే యిప్పటికీ ఒళ్ళు జలదరిస్తుంది.

"పాకిస్తాన్ యుద్ధం అప్పుడూ యింత ఘోరం లేదు" అని ఏడ్చింది మా అమ్మ.

వదినకు నోటమాట రాలేదు. పిల్లలు ఆమెను బితుకు బితుకుమంటూ అతుక్కున్నారు.

"అయినా ఖలిస్తాన్ అంటున్నవాళ్ళు విదేశాల్లోనే వున్నారని వాళ్ళకుతెల్సుగా. యిదేం దారుణం" అన్నాను నేను.

అంత బాధలోనూ నాన్న వుద్రేకపడిపోయాడు. "మా కోసం నీళ్ళడుగుతున్న రైతులకోసం" అని అరిచాడు. ఆయన కేకలు బయట వినబడతాయేమోనని అమ్మ భయపడిపోయింది.

వారం రోజులు దాటినా అన్నయ్య జాడ తెలియలేదు. ఏమైపోయాడో తెలియదు. రాకూడని అనుమానం అందరిలోనూ వచ్చేసింది. అయినా ఎవరూ నోరు మెదపడంలేదు.

నాన్న చేతికి కట్టు కట్టించే అవకాశంలేదు. యింట్లోనే ఏదో మలాంపట్టీ వేద్దామంటే ఆ అవకాశమూ లేదు. ఏవో నూనెలురాసి అమ్మ కట్టు కట్టింది. ఆయన మూల్గులతో యిల్లు మరింత నరకరూపంగా మారిపోయింది.

జులై నెల మొదటి వారంలో ఉదయంపూట ఓ రెండు గంటలు కర్ఫ్యూ సడలించడం మొదలుపెట్టేరు. అయినా అన్నయ్య జాడ తెలియలేదు. అలా తీసుకు వెళ్ళిపోయిన వారి సంఖ్య మావూర్లో రెండొందలుమందికి పైగానే తేలింది. ఆడపిల్లల్ని పోగొట్టుకున్న కుటుంబాల విషయం, భార్యల్ని కోల్పోయిన భర్తల నిస్సహాయతా మరీ హీనంగావుంది.

ఎందుకైనా మంచిదని నన్ను పాటియాలా వెళ్ళిపొమ్మని అమ్మా నాన్న వదినా పోరుపెడుతుంటే అయిష్టంగానే యూనివర్శిటీకి తిరిగి వచ్చేశాను.

* * * *

పదిమందిలో ఒకరికి గాయం అయితే మిగతావాళ్ళు సానుభూతి చూపిస్తారు. పదిమందికీ గాయాలైతే యిక సానుభూతి ప్రసక్తి వుండదు. యిక్కడ కావలసింది సానుభూతికాదు. ఐక్యత.

పరీక్షల డేట్లు ప్రకటించినా సగంమంది కూడా తిరిగి రాలేదు. రాని వాళ్ళ గురించి అందరికీ ఆందోళనగానే వుంది.

అన్నం వుడికిందో లేదో తెలుసుకోవడానికి అన్నమంతా చూడక్కరలేదు. ఓ మెతుకు పట్టుకుంటే చాలు. మా రాష్ట్రంలో పరిస్థితి తెల్సుకోవడానికి అంధరి

అనుభవాలూ పేరుపేరున తెల్సుకోవాల్సిన అవసరం లేదు. నా అనుభవం చాలు. మొత్తం పరిస్థితిని బేరీజు వెయ్యడానికి.

యూనివర్సిటీలో అయితే రక్షణ వుంటుందేమోననుకున్న నా ఆశ పిచ్చి భ్రమే అయ్యింది. మా యూనివర్సిటీ గెస్ట్ హౌస్‌లోనే సైన్యం క్యాంపు పెట్టింది. పాటియాలా నగరంలోనే కాదు: యూనివర్శిటీ క్లాస్ రూముల్లో, లైబ్రరీల్లో, లేబరేటరీల్లో, ప్లేగ్రౌండ్స్‌లో, అసెంబ్లీహాలుల్లో, హాస్టలు గదుల్లో ఎక్కడ చూసినా సైనికులే కాపలాకాస్తున్నారు. నలుగురు విద్యార్థులు ఎక్కడవుంటే అక్కడ ఓ సైనికుడు వచ్చి నిలబడిపోతున్నాడు. ఈ నిఘా ప్రొఫెసర్లకూ డీన్‌లకూ తప్పడంలేదు.

విద్యార్థుల మొహాలు పాలిపోయివున్నాయి. కళ్ళతో పలకరించుకోవడం తప్పించి ఎవరూ నోరు మెదిపి మాట్లాడడంలేదు. ఎప్పుడు ఎక్కడ తుపాకి మోత వినబడుతుందోనని అందరికీ భయంగానే వుంది. దీనికితోడు మే, జూన్, జులై నెలలకు మెస్ చార్జీలు కట్టమని వచ్చిన నోటీసు మమ్మల్ని మరింత కలవరపర్చింది. మూడునెలల మెస్ చార్జీలు యిప్పుడు ఎక్కడనుండి తేవాలి ? అయినా మే, జూన్, నెలల్లో హాస్టలు పనిచెయ్యలేదుగా. ఆ విషయమే విద్యార్థుల తరఫున రిచ్‌పాల్‌సింగ్ వి.సి తో చర్చించాడు. చివరికి జులై నెలకు మాత్రమే ఫీజు కట్టమని మరోనోటీసు వచ్చింది.

జులై నెలకు కూడా ఫీజు కట్టే స్థితిలో ఎవరూలేరు. యిళ్ళకు ఉత్తరాలు రాయలేరు. రాసినా వాళ్ళు పంపలేరు. అసలు ఉత్తరాలు చేరతాయని నమ్మకమూ లేదు. ఉత్తరాల్లో ఏదైనా కష్టసుఖాలు రాసుకుంటే అది తీవ్రవాదం అయిపోతుందేమోనని మరో భయం.

ఆరోజు జులై యిరవై అనుకుంటాను.

రాత్రి ఎనిమిదింటికే ఒక్కొక్కరం మెస్‌నుండి సరాసరి హిస్టరీ హాస్టల్‌కు చేరుకొని, రిచ్‌పాల్ గదిలో సమావేశం అయ్యాం.

రిచ్‌పాల్ ఎర్రగా పొడుగ్గా ఉంటాడు. తలపాగాకట్టి నిలబడితే ఆరున్నర అడుగుల మనిషి. నాతోనే హిస్టరీలో యంఫిల్ చేస్తున్నాడు. వల్లటి గెడ్డం, సూటి ముక్కు ఒకసారి చూస్తే మరల మరలా చూడాలనే ఆకారం.

మరికాస్సేపటికి బలబీర్‌సింగ్, ఉషాబేడీ అక్కడకు చేరుకున్నారు, ఉషాబేడీ సన్నగా గెడకర్రలా వుంటుంది. మనిషి ఎరుపేగానీ రక్తంలేనట్లు పాలిపోయి వుంటుంది. అతిసున్నితమైన ఆమెమెడకు కళ్ళజోడును కూడా భరించలేనట్లుగా వుంటుంది. అప్పటికే చిన్నగా తుంపర మొదలవ్వడంవల్ల ఆమె చలికి కొద్దిగా వణుకుతుంది.

ఎనిమిదిన్నర అయ్యేటప్పటికి మొత్తం ఓ అరవై మంది గుమికూడాం. మాకిది ఎప్పుడూ అలవాటే. మాసమస్యలేమైనావుంటే వి.సీ ను రాత్రి డిన్నర్ తరువాత కలుస్తుంటాం.

"మొదట డీన్ అర్జున్‌సింగ్ క్వార్టర్స్‌కు వెళ్ళి అక్కడనుండి వి.సి బంగ్లాకు వెళ్దాం" అన్నాడు రిచ్‌పాల్. అందరం సరేనని బయలుదేరాం.

నెమ్మదిగా చినుకులు పెద్దవౌతున్నాయి. అప్పుడప్పుడూ ఉరుములు మెరవడం తప్పించి మరో వెలుతురులేదు, క్యాంపస్ అంతా చీకటిగావుంది. దారికి యిరువైపులా వున్న చెట్లు గాలికి కదలి 'టపటపా' నీటిచుక్కల్ని రాల్చుతున్నాయి. చలికి అను కుంటాను ఏవోపిట్టలు "కుహూకుహూ" అంటున్నాయి.

"రెండేళ్ళ వుద్యమంలో తీవ్రవాదుల చేతుల్లో నూటయాభైమంది చనిపోయారు. అమృతసర్‌లో ఆ ఒక్కరోజే పన్నెండువందల మందిని చంపింది సైన్యం" రిచ్‌పాల్‌సింగ్ చెప్పుకు పోతున్నాడు.

"డిస్ట్రిక్ట్స్‌లో పరిస్థితి యింకా ఘోరంగావుంది. వూరికి ఓ రెండొందల మందినైనా సైన్యం కాల్చేసి వుంటుంది." ఉషాబేడీ తనకు తెలిసిన వివరాలు చెపుతుంది.

"శాంతి భద్రతలు కాపాడడం అంటే యిదే కాబోలు" బల్‌బీర్‌సింగ్ అందు కున్నాడు. కొందరు ఆమాటలకు ఘొల్లున నవ్వేశారు. అలా నవ్వుతూనే ముందుకు నడుస్తూ మేము మా కళ్ళమీద ఒక్కసారే హెడ్‌లైట్ల వెలుగు పడడంతో అవాక్కయి ఆగిపోయాం.

"సైన్యం, సైన్యం" ఎవరో గుసగుసలాడేరు-

"యింతవరకూ యిక్కడ చీకట్లో చప్పుడు చెయ్యకుండా మాటేశారన్న మాట" ఎవరో వెనకనుండి వ్యాఖ్యానిస్తున్నారు.

"యిద్రండీ" ఎవరిదో గొంతు ట్రక్కు వైపునుండి వినబడుతున్నది. లైట్ల కాంతి మా కళ్ళమీద పడుతుండడం వల్ల అతని మొఖం కనబడటంలేదు.

"ఎక్కడికి వెళుతున్నారా?" మళ్ళా ఆదేశంతం.

"వి.సి ని కలవడానికి" రిచ్‌పాల్ సమాధానం యిచ్చాడు.

"యితనారాత్ మే.... క్యా? గాండ్ మరానేకో?" స్త్రీలున్నారన్న ధ్యాసకూడా లేదతనికి

ఉషబేడీ ముందుకు వెళ్ళి "మేం ఎప్పుడూ వి.సీ గార్ని ఈ సమయంలోనే కలుస్తుంటాం" అన్నారు.

"సరే-సరే, వెంటనే తిరిగి వచ్చేయండి—పదితరువాత బయట కనిపించారో..." మాకందరికీ హెచ్చరిక చేస్తూ ట్రక్ ముందుకు వెళ్ళిపోయింది.

మేం డీన్ అర్జున్‌సింగ్ గారి క్వార్టర్స్‌కు వెళ్ళేటప్పటికి ఆయన వార్డన్ జగదీష్ కపూర్‌తో మా గురించే మాట్లాడుతున్నారు. యిక ఆలస్యం చెయ్యకుండా వాళ్ళిద్దర్నీ కలుపుకొని మేమంతా వి.సీ బంగ్లాకు బయల్దేరాం.

దారిలో మాకు మరో ట్రక్కు ఎదురైంది. మొదటిసారి జరిగిన తతంగమే మళ్ళా జరిగింది. అర్జున్‌సింగ్ గారు ఏదో సర్ది చెప్పి పంపించేశారు.

అందరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు. "మేమంతా యిప్పుడు యుద్ధ ఖైదీలం తెలుసా?" అన్నారు డీన్. ఎవరూ మాట్లాడలేదు.

వి.సీ బంగ్లా ముందు ఓ మిలట్రీజీప్ ఆగివుంది. ఎందుకో దాన్ని అక్కడ చూడగానే మా వుత్సాహం నీరుగారిపోయింది. మాకన్నాముందే ఎవడో మిలటరీ ఆఫీసర్ యిక్కడ ప్రత్యక్షమయిపోయాడన్నమాట. గేటు తెరుచుకొని లోపలికివెళ్ళి, అందర్నీ వరండాలోనే వుండమనిచెప్పి రిచ్‌పాల్ బజర్ నొక్కాడు.

అయిదు నిముషాల తరువాత ఓ ముసలి నౌకరువచ్చి తలుపు తెరిచాడు. వి.సీ గారు ఏవరితోనో మాట్లాడుతున్నారని చెప్పి, వెళ్ళిపోయాడు. నేను, రిచ్‌పాల్, బల్‌బీర్, ఉషాబేడీ, డీన్‌గారు, వార్డన్‌గారూ హాలులోకెళ్ళి సోఫాల్లో

కూర్చున్నాం. మరో పదినిముషాల తరువాత వి.సీ గారు వచ్చారు. వచ్చీరాంగానే విషయమేంటో తెలుసుకోకుండానే అంత రాత్రిపూట తనను డిస్టర్బ్ చేసినందుకు మండిపడ్డారు.

"యిదేం కొత్తకాదు కదండీ. ఎప్పుడూ వచ్చేదేగా" అని సర్దిచెప్పబోయాడు రిచ్‌పాల్. వి సీ గారు అతనివైపు చూడనైనా చూడకుండా డీన్‌గార్ని వార్డన్‌గార్ని చూసి "మీరెందుకండీ వాళ్ళకు వత్తాసుగా వస్తారు. స్టూడెంట్స్ కమ్యూనిటీతో మీకేంపని" అన్నారు చిరాగ్గా.

వార్డన్ కపూర్‌గారు కలగజేసుకొని 'యిది హాస్టలు సమస్యేకదండి' అన్నారు.

"ఏదైనా రేపు మాట్లాడదాం. యిప్పుడు కుదర్దు" నిర్మొహమాటంగా జాడించి చెప్పేశారు. "వాళ్ళ సమస్యను కాస్తంత సానుభూతితో అర్థం చేసుకోండి" అని డీన్‌గారు అంటున్నా ఆయన పట్టనట్లే వుండిపోయారు.

వి.సీ గారి ప్రవర్తనే విచిత్రంగావుంది "ముందు మీరంతా యిక్కడనుండి వెళ్ళిపోండి. నా ప్రాబ్లమ్స్ నాకున్నాయి. వీటన్నింటినీ నేను ఫేస్ చెయ్యలేను. కావలిస్తే వుదయం ఆఫీసులో కలవండి" అంటూ సమాధానం కూడా చెప్పకుండా అవతలి గదిలోనికి వెళ్ళిపోయాడు. అక్కడ ఆ గది గుమ్మందగ్గర మేజర్ ప్రీతమ్ దయాళ్ నిలబడి మావంక కొరకొర చూపులు చూస్తున్నాడు. అతన్ని చూడడం నాకదే మొదటిసారి.

"మీరే వినకపోతే మేం ఎవరికి చెప్పుకోవాలి?" అంటూ అరిచాడు రిచ్‌పాల్ ఆవేశంగా. అతని మాటలు వాళ్ళ చెవుల్ని తాకివుండవు. తాకినా ప్రయోజనమూ లేదు.

అక్కడవుండి చెయ్యగలిగిందేమీ లేదని మేమంతా బయటకు వచ్చేశాం. "ఏమైంది? ఏమన్నారు?" అని బయటవాళ్ళు ఒకటే ఆతృతతో అడుగుతున్నారు.

"యిప్పుడు వి.సీ గారూ యుద్ధ ఖైదీ" అంది ఉషాబేడీ.

"ఆఁ ఆఁ... గ్లోరిఫైడ్ ప్రిజనర్ ఆఫ్ వార్" అన్నాడు రిచ్‌పాల్. ఆ మాటలకు డీన్‌గారితోసహా అందరికీనవ్వొచ్చింది.

అందరు నీరసంగా తిరుగుదారి పట్టాం. హవాయి చెప్పులు బురదను చిమ్ముతున్నాయి. చినుకులు తగ్గలేదు. ఉషాబేడీ వణుకుతుంది. "మీకసలే జ్వరంగావుంది రాకుండా వుండాల్సింది" అన్నాడు రిచ్‌పాల్.

"ఈమాత్రానికే తట్టుకోగలను" అందామె నెమ్మదిగా మిగతా వాళ్ళంతా ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"మళ్ళీ ట్రక్కు వస్తుంది" అన్నారు ఎవరో.

"వెనకనుండి మరోటి వస్తుంది" అన్నారు మరొకరు. మా మాటలు పూర్తి కాకముందే మమ్మల్నందర్నీ రెండు ట్రక్కులు రెండువైపులనుండీ చుట్టేశాయి. సైనికులు దడదడా బూట్లచప్పుడు చేసుకుంటూ క్రిందకు దిగి వరసగా నిలబడిపోతున్నారు. యింతలో మరో జీపు వచ్చి ఆగింది. అందులోనుండి ముగ్గురు మేజర్లు క్రిందకు దిగేరు.

యినప టోపీల రాపిడీ, బూట్ల శబ్దం, తుపాకులు సర్దుకుంటున్న చప్పుళ్ళ, అరుపులు, కేకలు, మా కంగారు అంతాకలిసి వాతావరణం భయంకరంగా మారిపోయింది.

"అందరూ ఎక్కడవాళ్ళక్కడ బోర్లాపడుకోండి" ఎవరిదో ఆజ్ఞ వినిపించింది. ఏంచెయ్యాలో మాకెవరికీ తోచడంలేదు. మరో మేజర్ మా ప్రక్కకొచ్చి "క్విక్ క్విక్" అంటున్నాడు. కొందర్ని మెడపట్టి వంచుతున్నాడు. తపతపా అందరం నేల మీద వాలిపోయాం. బట్టలన్నీ బురద. పొట్టక్రింద నీరు చల్లగా తగులుతుంది.

వాతావరణంలో వుద్రేకం, క్రింద బురద చల్లదనం. మా పరిస్థితి చాలా వింతగావుంది.

"ముక్కులు నేలకు ఆన్చండి" మరో ఆజ్ఞ జారీ అయింది. డీన్‌గారు నిలబడి వున్నట్లున్నారు "ఏమైంది అసలు సంగతేమిటి ? "అనడుగుతున్నారు.

ఆయన్నెవరో "హట్ హరామ్ జాదే" అంటూ గెంటేశారు. ఆయన రోడ్డు అంచున పడిపోయారు.

"ఎవరయినా తల కదిలించడంగానీ, పైకి లేవడానికిగానీ ప్రయత్నించారా ప్రాణాలుపోతాయి" అదేగొంతు. మేజర్ ప్రీతమ్‌దయాళ్ గొంతు.

తుపాకీ మడాలు మా వీపులమీద స్వైర విహారం చేస్తున్నాయి. అందరూ గిలగిలా కొట్టుకుంటూ మూల్గుతున్నారు. శబ్దాన్నిబట్టి అన్నీ వూహించుకోవడమేగానీ కళ్ళముందు చీకటినేల తప్పిస్తే మరేమీ కనబడ్డంలేదు.

బురద ముక్కులోకి ప్రాకుతోంది. మట్టివాసన, శ్వాశపీల్చడం కూడా కష్టంగా వుంది. వీపుమీద పడ్డదెబ్బలలో నడుం పట్టేసింది.

ఎక్కడో వార్డన్ గొంతు అస్పష్టంగా వినబడుతుంది.

"యూ డర్టీ సివిలియన్ సైన్యంలో ఆర్డర్లే వుంటాయి. సంజాయిషీలు వుండవు" ఎవరో వార్డన్‌గార్నే అనుకుంటాను తిడుతున్నారు.

గాలికి ఒక్కసారిగా చెట్లన్నీ కదిలి ఆకుల్లో దాగున్న వర్షపునీరు తపతపా రాలుతుంది.

"రిచ్‌పాల్‌సింగ్ ఎవరు ? వాడ్ని యిటు రమ్మనండి" మేజర్ దయాళ్ గొంతు గర్జిస్తుంది.

మాలోనుండి ఎవరో లేచి, బట్టలకంటిన బురదను దులుపుకుంటున్నారు. ప్రక్కకు తిరిగిచూసాను. అంతే తలమీద తుపాకీమడం బలంగా గుద్దుకుంది.

"బల్‌బీర్‌సింగ్, రఘుబీర్‌సింగ్" లిస్టు పూర్తయింది. నేను దిమ్ముగావున్న తలను పట్టుకొని లేచినిలబడ్డాను. అప్పటికే రిచ్‌పాల్‌ను ట్రక్కు దగ్గరకు తీసుకెళ్ళుతున్నారు. వాళ్ళవెనుక బల్‌బీర్ నెమ్మదిగా నడుస్తున్నాడు. వార్డన్‌గారూ, డీన్‌గారు అటుప్రక్కవున్నారనుకుంటాను. వాళ్ళు ఆ చీకట్లో కనబడడంలేదు. నేను ట్రక్‌వైపు కదిలాను.

"మీరు ముగ్గురూ ట్రక్ ఎక్కండి" అన్నాడు మేజర్ దయాళ్. మమ్మల్ని ట్రక్‌లోనికి బలవంతంగా గెంటుతున్నారు కొందరు సైనికులు. రిచ్‌పాల్ ప్రతిఘటించాడు. అయినా లాభంలేకపోయింది.

"క్రిందవున్నవార్ని చూసి మీరంతా మీ హాస్టలుకు వెళ్ళిపొండి. మరలా యిలా కనిపించారో పిట్టల్నికాల్చినట్టు కాల్చిపడేస్తాం" ఎవరో మేజర్ అరుస్తున్నాడు.

"క్విక్ క్విక్ పరుగెత్తండి. లేదా ట్రక్ క్రింద నలిపిపడేస్తాను" మేజర్ దయాళ్ అందుకున్నాడు.

ట్రక్ స్టార్ట్ అయ్యింది. డ్రైవర్ క్లచ్‌నొక్కి గేర్లు మారుస్తున్నాడు.

క్రిందున్నవాళ్ళు కంగారు కంగారుగా లేచినిలబడుతున్నారు. లైట్లవెలుగులో బురద గొట్టుకుపోయిన వాళ్ళ బట్టల్ని చూస్తే ఒళ్ళంతా రక్తంలా కనబడుతుంది.

ట్రక్ కదిలింది. ఉషాబేడీ ఒక్కవుదుటన గెంతి ట్రక్కు అడ్డంగానిలబడి రెండుచేతులూ అడ్డంగా చాచింది. "తీసుకెళ్తే అందర్నీ తీసుకెళ్ళండి. లేదా ఆ ముగ్గుర్నీ వదలండి" ఆమె కంఠం గాలిలో మార్మోగుతూంది. ఆమె అంత గట్టిగా ఎలా అనగలుగుతుందో, ఆమెకాశక్తి ఎక్కడినుండి వచ్చిందో అందరికీ ఆశ్చర్యం గానేవుంది. ఆ పరిస్థితిలోనూ ఆమె ప్రవర్తన మాకు కొండంత ధైర్యాన్నియిచ్చింది.

నలుగురైదుగురు సైనికులు గబగబ ట్రక్కులోనుండి దూకి ఆమెను ప్రక్కకు లాగడానికి ప్రయత్నిస్తున్నారు. అయినా వాళ్ళకు సాధ్యం కావడంలేదు. పళ్ళుబిగబట్టి ఒళ్ళంతా బిగిసిపోయినట్లు నిలబడిపోయిందామె. కళ్ళు తెగిపోయి బయటకు వచ్చేసినట్లున్నాయి. కళ్ళజోడు ఎక్కడో రాలిపోయింది. పెనుగులాటలో ఆమె గౌను చిరిగిపోయింది. మరి కొందరు స్టూడెంట్స్ వచ్చి ఆమె ప్రక్కనే ట్రక్కుకు అడ్డంగా నిలబడిపోయారు.

మేజర్ దయాళ్ బండబూతులు తిడుతున్నాడు. ట్రక్ను వాళ్ళమీదగా పోనివ్వమని డ్రైవర్ను భుజంమీద ఒక గుద్దుగుద్దాడు. ట్రక్ కదిలింది. జరగబోయే దారుణాన్ని వూహించలేకుండా వున్నాం. ఏక్కడనుండి వచ్చేరో డీన్‌గారు ఉషను ఒక్కవుదుటున ప్రక్కకు లాగేశారు. కొంతమంది స్టూడెంట్స్ హాస్టలువైపు పరుగు తీస్తున్నారు. కొందరు దారికి అడ్డంపడి చెట్లలోనికి పరుగెడుతున్నారు పుట్టచిటికితే కంగారుగా పరుగెత్తే చీమల్లా.

"మమ్మల్నీకూడా అరెస్టు చెయ్యండి" బొంగురుబోయిన ఉష కంఠం యింక వినబడుతునే వుంది. ట్రక్ హెడ్ క్వార్టర్సుకు చేరుతుంది.

* * * *

మా ముగ్గుర్నీ యూనివర్శిటీ గెస్టుహౌస్‌కు తీసుకెళ్ళేరు. యిప్పుడు సైన్యానికి అదే హెడ్‌క్వార్టర్సు, అక్కడ ఓ గదిలో గోడవారగా మమ్మల్ని నిలబెట్టారు.

ఆగదిలో యిద్దరు ఆఫీసర్లు రమ్ముతాగుతున్నారు, అప్పటికే రమ్ము వాళ్ళను పూర్తిగా ఆక్రమించుకుంది. ఒకడు తాను బంగ్లాదేశ్ యుద్ధంలో ఎలా విజృంభించాడో

చెప్తుంటే పురోడు తాను స్వర్ణదేవాలయంలో ఎలా స్వైర విహారం చేశాడో చెప్పుకొంటున్నాడు.

వాళ్ళలో ఒకడు మమ్మల్నిచూసి "యిదిగో గొర్రెలు వచ్చేశాయి" అన్నాడు హేళనగా.

రెండోవాడు "రోజుకోసారన్నా తుపాకీ పేల్చకపోతే ఫౌజీకు అన్నం సహించదు గురు" అంటున్నాడు.

అలా వాళ్ళను చూస్తూ నిలబడిపోయాం. అలా ఎంత సేపు నిలబడ్డామోగానీ అలసటతో నిద్రముంచుకొచ్చి గోడకానుకొని నిద్రపోయాం.

తెల్లవారగట్ల మూడున్నరకు మమ్మల్ని బూటుకాళ్ళతో బాదుతుంటే మెలుకువ వచ్చింది. మాముందు మొత్తం అయిదుగురు మేజర్లు నిలబడివున్నారు. మమ్మల్ని తంతూనే ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు.

మాకేమీ అర్థం కావడంలేదు. తల దెబ్బలతో దిమ్ముగా వుంది. నిద్రలేక కళ్ళు కారంచల్లినట్లు మండుతున్నాయి. ఏవో లైట్ల కాంతి మాకళ్ళ మీద పడుతుండడంతో అసలు మెదడు పనిచెయ్యడమేలేదు. ఒక్కక్షణం. యిలా ఈ సమయంలో చిత్రహింసలు పెట్టడం కన్న ఒక్కసారే మమ్మల్ని చంపేసినా బావుండేది, అనిపించింది, కాని అది పిరికితనం.

"దీన్ని ఎవరు ప్లాన్ చేశారు. ?"

"మిమ్మల్ని ఎవరు బలపరచి ప్రోత్సహిస్తున్నారు ?"

"యింకేం చేయాలను కుంటున్నారు ?"

"ఆయుధాలున్నాయా ?"

దేనికీ ఎవరమూ నోరిప్పి సమాధానం చెప్పలేదు.

"ఆయుధాలు ఎవరు పంపిస్తున్నారు ?" మేజర్ దయాళ్ రిచ్‌పాలు సిగముడి వున్న గుడ్డను గుంజుతూ అడిగాడు.

"మాకవేం తెలియవు" అంటున్నాడు రిచ్‌పాల్. అంతే అతనితల గోడకు గుద్దుకుంది—అది చిట్లి రక్తం బొట బొటా కారుతుంది. వాళ్ళు యివేం పట్టించుకోలేదు. బూటు కాలుతో కాలుమీద బలంగా తన్నాడు.

"అమ్మా !" నేలమీదపడి రిచ్‌పాల్ గిజ, గిజా కొట్టుకున్నాడు. కాలికండరాల్ని చీల్చుకొని బయటకు వచ్చేసింది ఎముక, ఎర్రటి రక్తం మధ్యన తెల్లటి ఎముక.

ఆ తరువాత నావంతు వచ్చింది. అదే ప్రశ్నలు, అవే చిత్రహింసలు, ఎన్ని దెబ్బలని తట్టుకొనేది ? ఎన్నికొట్టేరని లెక్కపెట్టుకొనేది ? కళ్ళు మూతపడడానికి ముందువాళ్ళ వికటాట్టహాసం యింకా గుర్తుంది—స్పృహ కోల్పోయాను.

* * *

గతంలో నుండి వర్తమానం లోనికి వస్తున్నాను.

"ప్రజలు—సమస్యలు—పోరాటం — నిర్బంధం—ఆయుధాలు—హెడ్‌క్వార్టర్స్" ఆలోచనలు గతాన్ని సమీక్షిస్తున్నాయి.

బల్‌బీర్ కోసం ప్రక్కకు తిరిగాను. ఆశ్చర్యం. అతను బెడ్‌మీదలేడు. ఏమైపోయాడు ? ఎక్కడికి తీసుకెళ్ళేరు ? అతను కూడా.... ? ఆలోచించలేకపోతున్న. స్పృహలో లేనందుకు నన్ను నేను తిట్టుకుంటున్న.

యింతలో బయట ఎవరివో అడుగుల చప్పుళ్ళు వినబడుతున్నాయి. గది తలుపులు తెరుచుకొని డాక్టరుగారితో పాటు వి.సీ, మేజర్ ప్రీతమ్ దయాళ్ వచ్చారు. డాక్టరుగారు ఏవో పరీక్షలుచేసి, ఓ యింజక్షన్ గుచ్చి "నౌ యూ ఆర్ అవుట్ ఆఫ్ డేంజర్" అన్నారు.

మేజర్‌దయాళ్ ఆయన్ని బయటకు వెళ్ళిపొమ్మని సైగచేస్తే డాక్టరుగారు మారుమాట్లాడకుండా తలఒంచుకొని వెళ్ళిపోయారు.

వి.సీగారు నాదగ్గరకు వచ్చి ఏదో చెప్పాలన్నట్లు చిన్నగా దగ్గేరు. ఏమిటన్నట్లు చూసాను నేను.

"జరిగిందేదో జరిగిపోయింది. దీన్ని మళ్ళా రచ్చకు ఈడ్చకు. రిచ్‌పాల్, బల్‌బీర్‌లా నువ్వూ బలై పోవడం నాకిష్టంలేదు" అన్నారు.

వి.సీలోని అసలుమనిషి బయటపడుతున్నాడు. నేను మారుమాట్లాడ కుండా ఆయన్నే తదేకంగా చూస్తున్నాను.

"రానున్న ప్రమాదం నీకు తెలియందేమీకాదు. రాష్ట్రం యింకా సైన్యం చేతుల్లోనేవుంది" అంటూ నా సమాధానం కోసం ఎదురు చూడకుండానే బయటకు వెళ్ళిపోయారు. దయాళ్ నన్ను ఒకసారి పరికించి వి.సీ వెనకే వెళ్ళిపోయాడు.

నాన్నగురించి నాకు బెంగలేదు. అన్నయ్య, ఏమైపోయాడనీ చింతలేదు. రిచ్‌పాల్, బల్‌బీర్, గురించీ మాపై జరిగిన చిత్రహింసల గురించీ నేను బాధ పడ్డంలేదు. బాధల్లా ఒక్కటే-రెండు నిముషాల ముందు నాదగ్గర కృపాణ్‌లేదు.

**12-10-84.**

* * *

కృపాణ్—సిక్కులు సాంప్రదాయంగా వాడేకత్తి.

రేడియో దూరదర్శన్ :

# సంస్కృతి - నిర్బంధం :

కోదండరామ్.

ఉత్పత్తి సాధనాలను తమ ఆధీనంలో ఉంచుకొనేవారి దోపిడీ నిరాటంకంగా సాగటానికి రాజ్యం తోడ్పడుతుంది. అయితే కేవలం బలప్రయోగమే అందుకు ఉపయోగపడే సాధనంకాదు. దోపిడికి గురవుతున్న వాళ్ల ఆలోచనలను ఆ దోపిడీ వ్యవస్థను ఆమోదించేటట్లు రూపొందించడంవల్లనే వ్యవస్థ సాఫీగా సాగుతుంది. అందుకే పాలకవర్గాలు సంస్కృతిపై తమ ఆధిపత్యాన్ని చెలాయిస్తుంటాయి.

గతించిన సమాజాలకన్నా ఆధునిక సమాజాలలో ఇది మరింత పకడ్బందీగా సాగుతుంది. సామ్రాజ్యవాద సాంకేతిక పరిజ్ఞాన సహాయంతో సాగుతుంటుంది. స్కూళ్లు, కాలేజీలు, పత్రికలు, సినిమాలు మాత్రమేకాదు. ప్రభుత్వ ఆధీనంలో ఉండే రేడియో, దూరదర్శన్ కూడా ఇందుకు ఉపయోగపడతాయి. రేడియో, దూరదర్శన్ ఎంచుకొనే విషయాలు, ప్రచారం చేసే వార్తలు ముఖ్యంగా నిరక్షరాస్యులయిన ప్రజలకు సమాజంపై ఉండే అవగాహనను నిర్ణయించడంలో కీలకమైన పాత్ర నిర్వహిస్తున్నాయి.

భారతదేశంలాంటి మూడవ ప్రపంచ దేశాలలో సామ్రాజ్యవాద దేశాల దోపిడి వలన వచ్చిన సంకర బూర్జువా వర్గం ఒకమృత శిశువు. అది పై దేశాల బూర్జువాల సహాయంతోనే నిలబడగలుగుతుంది. అది ఫ్యూడల్ వ్యవస్థను ఛేదించుకొని రాలేదు. దాని ఆసరాతోనే నెలకొన్నది. అందుకే ఫ్యూడల్ వ్యవస్థను సంస్కృతిని విచ్ఛిన్నం చేయలేదు. అలాకాక పోగా పెట్టుబడి ఫ్యూడల్ సంస్కృతిని కాపాడటానికి, ప్రచారం చేయడానికి సాధనం అవుతుంది. మనసినిమారంగం ఇందుకు ఒకమంచి ఉదాహరణ. అట్లాగే రేడియో, దూరదర్శన్‌లు కూడా. మత భావాలను ప్రేరేపించి ప్రజల మధ్య విద్వేషాలను రెచ్చగొట్టడంలో వీటిపాత్ర మతోన్మాద పార్టీలకు తీసిపోయిందేమీ కాదు. ఇందుకు పంజాబ్ ఒక ఉదాహరణ. పంజాబ్‌లో సైనికచర్య తర్వాత అక్కడ స్థితి గురించి మనకు తెలిసిన వాస్తవాలు. చాలా తక్కువ. అయితే పంజాబ్ గురించి ప్రభుత్వం ఇతరత్రా చెప్తున్న సమాచారానికి రేడియో, టి.వి లలో చేస్తున్న ప్రచారానికి మధ్య ఉన్న వైరుధ్యం గమనిస్తే సంస్కృతిని పాలనవర్గాలు ఏరకంగా ఉపయోగిస్తుంటాయో తెలిసి పోతుంది.

సైనిక చర్య జరిగిన వెంటనే పంజాబులోని అన్ని ముఖ్య పట్టణాలలోను కర్ఫ్యూ విధించారని రేడియో, దూరదర్శన్ కనీసం నాలుగు రోజులపాటు ప్రతిసారి వార్తలలో చెప్పారు. నిజానికి కర్ఫ్యూ గ్రామాలతో సహా పంజాబ్ రాష్ట్రమంతా విధిస్తున్నామని ప్రభుత్వ ఆర్డరు పేర్కొంది.

సైనిక చర్య తర్వాత 38 గురుద్వారాలు, 2 గుళ్ళు, ఒక మసీదుపై సైనికులు దాడి చేసారని వార్తవచ్చింది. ఆ తర్వాత వార్తల్లో కేవలం గురుద్వారాల్లో మందుగుండు సామాగ్రి దొరికిందని మాత్రమే చెప్పారు. మిగతా మందిరాల విషయం ప్రస్తావింపబడలేదు. అయితే హిందూ సురక్షాసమితి, హిందూ శివసేనలాంటి మతోన్మాద సంస్థలు సైనిక చర్యకు ముందు తుపాకులు ఉపయోగించిన విషయం అందరికి తెలిసిందే – సైనిక చర్య జరగడానికి కొద్ది నెలలముందు ఏడు హిందూ మతోన్మాద సంస్థలు లూధియానాలో ఒక గుళ్లోసమావేశమయ్యాయి. అప్పుడు వాటి కలయికకు స్వాగతం పలుకుతూ 21 సార్లు తుపాకి పేల్చారు. అట్లాగే పాటియాలాలోని ఆర్యసమాజ్‌మందిర్‌ను హిందూమతోన్మాద శక్తులు ఆశ్రయంగా ఉపయోగించుకున్నాయి. అంతేకాక పవన్‌కుమార్‌శర్మ, జగదీశ్ తంగ్రి లాంటి మతతత్వ ప్రచారకులు హిందువులు ఆయుధాలు సేకరించి ఉపయోగించాలని ఉద్బోధించారు. పవన్‌కుమార్‌శర్మ గ్రెనేడ్‌లతో పోలీసులకు దొరికి పోయాడు. కాని సైనిక దాడి తర్వాత గుళ్లో ఏమి దొరికాయో మాత్రం ఎక్కడా ప్రకటించలేదు.

సిక్కు తీవ్రవాదులకు, ముస్లిమ్‌లకు అదీను పాకిస్తాన్‌కు సంబంధం ఉందని ధ్వనించే వార్తలను పెద్ద ఎత్తున ప్రచారం చేసారు. స్వర్ణ దేవాలయంలో చనిపోయిన ఇద్దరు నిహంగులు వైద్యపరీక్షలో మర్మాంగాన్ని పరిశీలించిన మీదట ఇస్లాం మతస్తులని తేలిందని పదేపదే చెప్పడం జరిగింది. ఇస్లాం మతస్తులందరు పాకిస్తానీయులే. నిజానికి భారత, పాకిస్తాన్ సరిహద్దులలో పెద్ద యెత్తున జరిగే స్మగ్లింగ్‌లో దొంగ వ్యాపారస్తులు ఇరుపైపుల ప్రభుత్వాలను మోసం చేయడానికి ఈ రకం పద్ధతులు వాడటం వల్ల ఈ వైద్యపరీక్షకు అర్థం లేదని గతంలో ప్రభుత్వమే భావించింది. పాకిస్తాన్ పేరు పదేపదే వినిపించిందిగాని ఇంతవరకు పాకిస్తాన్‌పై ఒక్క నిర్దిష్టాధారం ప్రభుత్వం చూపలేకపోయింది.

అప్పటి హోం మంత్రి సేథి సిక్కు తీవ్రవాదులకు హిమాచలప్రదేశ్,

ఉత్తరప్రదేశ్, కాశ్మీర్ రాష్ట్రాలలో శిక్షణ ఇవ్వడం జరిగిందని ప్రకటించాడు. కాని రేడియో, దూరదర్శన్‌లు కేవలం కాశ్మీర్ పేరును మాత్రమే పేర్కొన్నాయి.

స్వర్ణ దేవాలయంపై జరిగిన సైనికదాడి తర్వాత వచ్చిన వార్తలు ఈ కోవకు చెందినవే. స్వర్ణదేవాలయానికి ఏమీ నష్టం వాటిల్లలేదనే అబద్ధపు ప్రచారం జరిగింది. వాస్తవానికి 800 చోట్ల బుల్లెట్ గుర్తులున్నాయి. రెండవది స్వర్ణదేవాలయంలో మత్తు పదార్థాలు పెద్ద ఎత్తున దొరికాయన్నది. 'మీడియమ్ మెషిన్‌గన్స్', విదేశీ ముద్రగల మందు సామాగ్రి దొరికిందని కూడా ప్రచారం జరిగింది. మీడియమ్ మెషిన్‌గన్స్ దొరకలేదని శ్వేత పత్రం అంగీకరించింది. మత్తు పదార్థాల గురించి చివరికి ప్రభుత్వం ఖండిస్తూ ప్రకటించింది. ఆ ఖండన వార్తనుమాత్రం రేడియో టెలివిజన్‌లు ప్రకటించలేదు.

భింద్రన్‌వాలా అనుచరుడు మేజర్ షుబేగ్‌సింగ్ విషయంలో కూడా ఇలాగే జరిగింది. ఈయన బాంగ్లాదేశ్‌లో ముక్తిబాహినికి భారత సైన్యాల తరఫున శిక్షణ ఇచ్చాడు. (బాంగ్లాదేశ్‌లో ముక్తిబాహిని సైన్యాలకు తాను శిక్షణ ఇవ్వలేదని 15 ఏళ్ళనుండి చెప్తున్న ప్రభుత్వం ఈ రూపంలో అయినా ఆ విషయం ఒప్పుకుందను కోండి. అది వేరే సంగతి) అందుకు ప్రభుత్వం ఆయనను గౌరవించింది. ఆ తర్వాత 1978 లో షుబేగ్‌సింగ్ అవినీతి ఆరోపణపై సర్వీసునుండి తొలగింపబడ్డాడు. కాని 1984 ఫిబ్రవరిలో ఆరోపణల్ని కోర్టు కొట్టివేసింది. కాని ప్రభుత్వ ప్రచార సాధనాలు మాత్రం షుబేగ్‌సింగ్ సైన్యంనుంచి తొలగింపబడిన అధికారిగానే చిత్రీక రించాయి. వాస్తవానికి జరిగిందేమిటంటే స్వర్ణదేవాలయ సంఘర్షణలో ఆయన మరణం తర్వాత శవానికి సైనిక లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి.

ఈ పచ్చి అబద్దాల ప్రచారంతోని హిందువులకు, సిక్కులకు మధ్య మత వైషమ్యాన్ని రెచ్చగొట్టడానికి రేడియో. టి.విలు ప్రయత్నించాయి. గుళ్ళపై సైనిక చర్యను పేర్కొనకపోవడం, హిందూ ఉన్మాదంపై చర్య తీసుకొనకపోవడం, తీసుకున్నా చెప్పకపోవడం, ముస్లిమ్‌లకు సిక్కులకు సంబంధాలున్నాయని ప్రచారం చెయ్యడం, పాకిస్తాన్ పరోక్ష సహాయం ఉందనిచెప్పడం అన్నీ హిందూ భావోద్రేకా లను రెచ్చగొట్టడానికి ఉద్దేశించినవే. ఇందిరా కాంగ్రెస్ అధికారంలో ఉన్న హిమాచల ప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌లలోకూడా సిక్కు తీవ్రవాదులకు శిక్షణ యివ్వడం జరిగిందని

ఓవక్క చెప్తూ, కేవలం కాశ్మీరు పేరు మాత్రమే పేర్కొనడం ఒకవయిపు ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వ వ్యతిరేక ప్రచారానికి కొత్త ముస్లిమ్ వ్యతిరేక భావాలను రెచ్చ గొట్టడానికి ఉద్దేశించినవే. రెండవవైపు వనిగట్టుకొని సిక్కుల మత విశ్వాసాలను అవమానపరిచే ఉద్దేశ్యంతో ప్రచారం జరిగింది. స్వర్ణాలయంలో మత్తుపదార్థాలు దొరికాయనే అబద్ధాల్ని ప్రచారం చేయడం ఏ మతోన్మాదానికి వ్యతిరేకంగా తాను సైనికచర్యకు దిగానని ప్రభుత్వం చెప్పుకుంటుందో ఆ మతోన్మాదాన్ని మరింత ఎక్కువ చేయడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నమే. రేడియో, టి.వి. మాత్రమే వింటూ, చూస్తూ ఏ రాజకీయ చైతన్యం లేని హిందువులమీద ఈ ప్రచార ప్రభావం ఎలా ఉంటుందో వివరించనవసరంలేదు.

మతోన్మాదం కొత్త సైనికచర్యను ప్రజలలో ఆమోదింప చేయడానికి కూడా ఈ ప్రచారం పెద్ద ఎత్తున జరిగింది. కనీసం పంజాబ్ బయట ఈ ప్రచారం చాలా మేరకు విజయవంతమయిందికూడా.

పాలక వర్గాలు సాంకేతిక సహాయంతో ప్రచార సాధనాల్ని ఎలా వాడు కుంటాయో తెలుసుకోవడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే. అయితే పంజాబ్ అందుకు నాటకీయమైన ఉదాహరణ, మొరటు ఉదాహరణ. రోజు, ప్రతిరోజు అనేక రూపాలలో అనేక సంఘటనలతో పాలకవర్గ సాంస్కృతిక ఆయుధాలు మన జ్ఞానాన్ని, మన అభిప్రాయాలని, మన విలువలని నిర్దేశిస్తుంటాయి. ప్రజల అజ్ఞానమే ప్రభుత్వ బలం అని (జారిస్టు ప్రభుత్వం గురించి) టాల్‌స్టాయి అన్నాడు ఈ అజ్ఞానాన్ని ప్రత్యామ్నాయ ప్రచార సాధనాలతోను, విశ్లేషణతోనూ ఎదుర్కోవడం ద్వారా మాత్రమే మనం ఈ ప్రభావాన్ని ఎదుర్కోగలం.

[ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ 8—9—84 సంచికలో ప్రీతమ్‌సింగ్ వ్యాసం ఆధారంగా.]

# ప్రజాకోర్టు

విప్లవకారులు నిర్వహించే ప్రజాకోర్టుల గురించి కొందరు రచయితలు విన్నవో, ఊహించినవో రాస్తున్నారు. శ్రీకాకుళ రైతాంగ పోరాటం నాడైనా, చివరికి ఇప్పుడైనా విప్లవోద్యమం నిర్వహించిన, నిర్వహిస్తున్న ప్రజాకోర్టుల గురించి 'కథలు' కాదు కథనం చదవండి.

1.

ఎ అప్పల్నాయుడు

వారం రోజుల క్రింపట గెంజిబట్టి, యిస్త్రీ చేయబడ్డ ఖాకీచొక్కా, ఖాకీ నిక్కరు....జెండా కొయ్యలా సన్నగా పొడుగ్గావున్న జగన్నాథరావు ఒంటిమీద ఎద్దుకి ఏనుగుతోలు తొడిగినట్లు ఒదులొదులుగా వున్నాయి. ఎండకి సెగవటతేలి తడిసి....అక్కడక్కడా తెల్లగా ఉప్పుదేలి గబ్బుకంపుగొడుతున్నాయి. నెత్తిమీది ఎర్రటోపీ కప్పిన జుత్తులోంచి చెమటలూరి మెహమ్మీదికి కారుతోంటే....జగన్నాథరావు మొహం తడిసిన పెద్దనక్క మొహంలా వుంది. గోర్జిలోంచి సైకిలు తొక్కుతుంటూ....అక్కడక్కడా వీలుగానిచోట సైకిలు దిగి వడుస్తూ....జగన్నాథరావు ఆ ముఠదెండలో, సుమారు ఉదయం పదకొండు గంటలవేళ....'కాకితాడ' వెల్తున్నాడు.

గోర్జిత్రోవ అక్కడ మలుపు తిరిగింది, మలుపు తిరిగేదాక.... ఎదురొచ్చేదేదీ కన్పించనంత దట్టంగా గోర్జికిరువైపులూ....డొంకటా! గోర్జి తోమట్టి వశువుల గిట్టలకీ, నాటుబిళ్ళకీ నలిగి, ధూళయి, తుప్పా, డొంకలునిండింది. తుప్పల ఆకులు స్వతహాగా వుండాల్సిన పచ్చదనంగాక, గోధుమరంగు ధూళిపడి ..మేకప్ చేయబడ్డట్లున్నాయి. ఎండతో గాలి....యీ ధూళిని మోసుకొస్తూ....దుమ్మువాసనేస్తోంది.

మలుపు తిరిగిన జవానుకి....ఎదురై పోయాడు అరిక పగడాలు ! ఎదురై పోయిన పగడాలు చేతిలో రెండు ఎర్ర పుంజులు.... పెద్దొరస పుంజులు రెక్కలాడిస్తూ కన్పించాయి.

పగడాలు, పగడాలు చేతిలో ఎర్ర పుంజులు ఒక్కసారిగా అదిరిపడ్డాయి.... సైకిల్ మీది జవాన్నిచూసి....ప్రాణం మీదికొచ్చిన పెద్దనక్కను చూసినట్లు! పుంజులు రెక్కలుగొట్టుకున్నాయి, పగడాల గుండెలు గొట్టుకున్నాయి.

జవాను సైకిల్‌గంట కొట్టాడు! సైకిలాపాడు! పగడాల్ని ఆపి "యేట్రారె కొండోడా! మంచి పెద్దొరన పుంజుల్లాగున్నాయేవిర, యేవిరా" అని చేతులు చాపాడు కోడిపుంజుల కోసము!

పోలీసోడి పాలబడితే మరి తప్పులురావు అని బెంగపడిన పగడాలు గునుస్తూ "నాది కావు బావ్....మొన్నపల్లం (కురుపాం) నుంచి మా నేస్తఁవొచ్చి డబ్బులిచ్చి కొనుక్కొండు, యీ పొద్దుతెమ్మంతే....వొట్టుకెల్తన్నాను" అన్నాడు.

"పల్లపోడే నేస్తమేటిరా ? పోలీసోడు కాడేటి ? అదికాదు, సూత్తానియ్యిరనీ సరి కిట్రలగ సుట్టుకుంతావియ్యేస్" అని లాక్కొని కోడి పుంజులు రెండింటినీ రెక్కలెత్తి బరువు ఆనికజూసుకొని, గుద్దమట్ట....గారకాయ తడిమి, బాగున్నాయని సంతృప్తిచెంది: "కష్టమొట్టనేపోదు" అని అనుకొని "యీ ఎండల సెవర్లెక్కి సైకిల్ తొక్కినందుకు....ఫలితం దక్కింది" అని భావించి; "సొండోడి సారా.... కోడికూరా" తోటిమజానిగూడ తల్చుకొని....రెండు ఎర్రపుంజుల్ని ఎగరేయదనిచాడు ఎర్రజెండవలాగ జగన్నాధరావు జవాను. పుంజులు రెండింటినీ, సైకిల్ హేండిల్‌కి తాడుతోటి కట్టేసాడు. సైకిల్ స్టాండు దించి....పయనమవసాగాడు....! కాకితాడకి!

"బాబ్బాబు! జవానుబావో! వొదిలీవా, నావిగావాపుంజులు! పల్లం మానేస్త మొల్లకోడు. పుంజులొట్టికెల్లకపోతే....మల్లి ఆల మొకం సూడలేను" పగడాలు.

"నేస్తం మొకం సూడకపోతే నష్టమేటిలేదు. కొండనమీకే, నాకొక్కవమొత్తే... మరినువ్వు నీ పెళ్ళంమొకం సూడద్ జాగర్త. పోనిగదాని, పుంజులుతోటి వది లెత్తన్ను. "దొరికినావురా, నక్సలైటు నాకొడకా" అని లాకప్పులెట్టి....ఎముకలిరిసీగల్ను" అని లాటీ పగడాల మొహమ్మీదకి ఊపి, అదిరించి "అంచేరెల్లు ఎల్లా ....అమాయకపోడి లాగున్నావు...ఏ ఊరేట్రా ?" అనడిగాడు. "కాకితాడ బావ్.."

"మరింకేమి నీనూ అక్కడికి వొత్తన్ను....సొండోడున్నాడురా ?" అనడిగాడు.

"ఉన్నాడు బావ్....నాకోళ్లిచ్చీవా !" సైకిల్ ఎదురుగెల్లి బ్రతిమాలుతూ అడిగాడు.

సైకిల్‌ని ముందుకి తోసి గుద్దించుతూ "ఏఁదిరింకొాదలవు, తిన్నగ తోవబట్ట్.. ఎముడేనకాల దమయంతి నాగొచ్చా వంతే....మెళ్ల జివ్వలు యిరిగి పోగలవు....

జేగర్త" అది మరోసారి సైకిల్ తోటి పగడాలుని తోస్సి: హేండిల్‌కి కట్టిన కోళ్ళని చేత్తో తడిమి- భద్రమే అని నిర్ణయించు కొని, ఈల వేసుకుంటూ... సైకిలెక్కి 'కాకితాడ' తోవబట్టాడు పోలీసు !

తన దారిద్ర్యాన్నీ, జవాను దౌర్జన్యాన్ని కలిపి తిట్టుకుంటూ. నేస్తం యేటంతాడో అని బెదురుతూ...పల్లెం వెల్లలేక...పగడాలు యింటివై పే తిరుగుముఖం పట్టాడు,

తిన్నగా..'కాకితాడ' ఊరిమొగానున్న సొందోడి యింటి యిందు సైకిలాపి, సైకిల్ దిగి, స్టేండు వేసాడు జవాను జగన్నాధరావు.

మందలోకి తిన్నగొచ్చేసిన 'ఎర్రజెందవ'ని చూసిన మేకల్లా చెల్లా చెదుర య్యారు. అప్పవరకూ సొందోడి అరుగుల మీద కూర్చున్న కొంతమంది గిరిజన్లు.

కదల్లేక దొరికి పోయిన చూలున్న మేక పీక పట్టుకున్న యెర్రజెందవలాగ... సొందోడింట్లోని యిప్ప సారా గూన పట్టుకున్నాడు జవాను.

సొందోడు యింట్లోలేడు. సొందోడి పెళ్ళాం కొంతమ్ముంది. కొంతమ్మకిదేమీ కొత్తగాదు. గనుక గాభరా పడలేదు.. భయపడనూలేదు. గూన ప్రక్కనే వున్న గ్లాసొకటి తీసి, యిప్పసారా గూనలో ముంచి ఆ గ్లాసు జవాను కందించింది.

"సొట్ట గ్లాసు సారాతోటి సరిపెట్టేద్దుమను కుంతన్నావేటే..సొండిదానా ? నే నెందుకొచ్చా నేటో తెలుసా ?" అని గదుముతూ గ్లాసందుకున్నాడు,

"పోలేరమ్మ తల్లికీ..పోలీసోడికీ అడ్డేటి ? నువ్వడి గిందెప్పుడు కాదన్నాము" అని చనువుగానే జవాబిచ్చింది కొంతమ్మ.

కొంతమ్మ చనువు..యెందుకో జగన్నాధరావుని చిరాకు పర్చింది. ఆ చిరాకు తోనే "యిరిడి ముక్కకి సేవ బట్టేసినట్టుగ..నీ ఒంటికి షోత్తరం బట్టేసిందే..నీకు.." అనింకేదో అనబోగా..సొండోడొచ్చాడు.

"దండాలు..జగన్నాధరావు జవాను గోరో..దండాలు అని చేతులెత్త కుండా నోటితో నమస్కరించి: భార్యతో "జవాను గోరికి కుర్చీ యేసి..కూకోమనలేక పోనావా?" అనడిగాడు.

మూలనున్న కుర్చీ ధూళి దులిపి తీసుకొచ్చివేస్తూ"ఐచ్చినకొంచి గయ్యి.. గయ్‌మని కేకలేసి తెయ్యితెయ్యిమని గెంతులేత్తండే గానేటి వాల్లందా..నిలత్తండా ?

నీను కూకోండి బావో..అని కుర్చీ యెయ్యడంకి ?" అనిజవాన్ని దెప్పుతూ జవా బిచ్చింది కాంతమ్మ.

కాంతమ్మ మాటల్లో దెప్పి పొడుపుని కప్పేసుకుంటూ "సర్లేగానీ, అదిగా సైకిల్ హేండిల్‌కి యెర్రపుంజులు రొండుంతాయి..అటికి తెచ్చి..నూక వెయ్యమే అందాకల..తిరగెల్లినప్పుడు ఒట్టికెల్తానని" పురమాయించాడు.

కాంతమ్మ కోళ్లు తెచ్చి "ఘనమయిన పుంజులు..యెక్కడ కొన్నావో గానీ బాగున్నాయి.."అంది.

"జగన్నాధరావు జవాను.. జేబుడబ్బు లెట్టిపిండొడాలు కొన్డు..పుంజులు కొంతాడా"సొండోడు.

"నోర్మూయ్‌ర.. సొండినా కొడకా ! కాలం మారిపోనాదిరా ! ఒట్టిపున్నెంకి 'ఒస' ముక్క దొరకవీ రోజుల్లనేపోతే..నెల మామూళ్ళకి సొండోడింటికి రావల్సి వొత్తాదే ?" అని తిరిగి దెబ్బ గొట్టాడు జవాను :

"జాను గానీ..కష్టపెడితే..కాకితోటి పంపేనా ! నువ్వే రావాలా ? రాక, రాక తిన్నగ పులి బండలోకి ఎలిపోవొచ్చినావు.." సొండోడు.

"ఒరేత్రో ! యేటి సొండోడా ; పులి బండంతన్నావు.. నీ యింటి కొత్తే ! గీర గుండేటిరా ?" పోలీసు గసిరాడు.

"అదిగాదు బావ్ ! యిదిగీ వొలసలన్నీ సంగమయి పోనాయి. యీ యేరియా ఓలు మొత్తంల సంగమే ప్రెబుత్వం. సత్తెం మేష్టురిగోరూ.. సంగపోల్లా యేటిజెప్తే అదే వేదం ! నీకు తెలస్టేటి? దగ్గిట, దగ్గిట మూడొందలొలనల్ల సంగానిదే రాజ్జెం ! బుగతలు భూ(వులొదులుకోని, సావుకార్లు అప్పొ, సప్పు లొదులుకొని పట్నాలంట పట్టేసినారు. కర్నం, నాయుడ్లు కలాలు మూస్సినారు. పారిస్టోల్లు..అడివిని మర్చి పోంద్రు; పని కాడనుండి పంబదాక, తిండి కాడ్నుండి..తగువులూ తంటాలు దాక.. అన్నిటికాడ.. అ సంగమోళ్లే ! యిప్పుడిక్కడ నీ గవిర్మెంటూ లేను...నీ పోలీస్త నమూ సెల్లదు.. యిదిగిదీ చంగతి" అది సొండోడు అప్పటి పరిస్థితిని క్లుప్తంగా వివరించాడు.

సొండోడి మాటల్తో జగన్నాధరావులో భయం కల్గింది. సంగం గురించీ, సత్తెం మేష్టారు గురించీ విన్నాడు. గానీ తమ స్టేషన్‌కి కనుచూపు దూరానున్న

'కాకితాడ' ల గూడా సంగమోల్ల బలం వుంటాదనుకోలేదు. అయినా యిపుడు తొందర పడాల! "వొచ్చింది ఒకందుకైనా.. సొండోడి వార్తవల్ల మరొకలాభం..ఈడ్ని స్టేషన్‌కి ఒట్టికెల్లి.. పయానా భయానా అడిగితే..సంగపోల్ల స్థావరాలు, సత్యం మాష్టారి అను పానులూ చెప్తాడు. ఈడ్ని తోడు తీసుకొని..ఫోర్సు మొత్తం బయులెల్తే..సత్యం మేస్టార్ని పట్టీవొచ్చు.. ఆ రకంగా ప్రమోషనూ, ప్రభుత్వం ప్రకటించిన బహుమా నమూ కొట్టీవొచ్చు..అప్పులు తీర్చీవొచ్చు..హాయిగ బతకొచ్చు" అని ప్లానులేసి, కలలుగన్న పోలీసు, గభాలున కుర్చీలోంచి లేచి, టోపీ తలకు తగిలించి, లాఠీ చంకలో పెట్టి..కాంతమ్మ నుండి కోడిపుంజుల్ని అందుకొనీ సైకిల్ వద్దకెల్లి, పుంజుల్ని హేండిల్‌కి కడుతూ "బానారే సొండోడా! నీకు సైకిలున్నాది గదరా! అలాగ టేసన్ దాక తోడు రమ్మిరా..!" అని పిల్చాడు.

"ఓలమ్మో! పోలీసోడితోటెల్తే యింకేటున్నాదా.. సంగపోలికెవులికేనా దనులయితే మా పనయి పోద్ది.. వొద్దు నాయినో.." కాంతమ్మ.

"ఓసేటీ నీ గోస! గవర్మెంటోడి మాటినకపోతే...గంగల కలిసిపోద్దే నీ యాపారం! అన్నాడు జవాను.

"యేపారం యేటిల కలిత్తే కల్నీ గానీ బతుకులు బుగ్గయిపోతాయి నాయినో.. సంగపోలికి యే పెమాదమో తలపెట్టమని మాటిచ్చి, అలకనుమానం రాకుండా బతుకొత్తన్నాము.. నే పోతే మీమూ పట్నాలు బట్టీవలసింది. పట్నమెల్తే పాసి గియ్యడంకి పనికిరాము...యిదిగీ యాపారంల...విన్నా...విన్నా...బెంచాము తప్పా యేటి మిగిలేను కోలేదు! అంది సేత ఒదిలీబావ్...మమ్మల్నొదిలీసి, నీ మామూళ్ల నువొట్టికెలిపో "అని చెప్పి, మొగుడితో" "అతగాని మామూళ్లిచ్చి గూడదేటి" అని కేకేసింది.

"సొండి నంజి కూతగా! పిండొడానికి పెల్లనిదానివి కొండల్ల యాపారం జేస్ని...భూవుతా, పుట్టలూ గడించినావు గడసావి దాన్లాగ యిరగ బలిస్ని...ఎవుడ్నే నువ్వు ఒట్టి పున్నేనికి పెంచావు ? అమ్మ! ఎంత కళ్ళ కొవరమే సూడు, సూడయితే: కాకిబట్టలోడి దెబ్బ కాస్కో...కాస్కో-యే" అని లాఠీ యెత్తి...యింట్లోని యిప్ప సారా గూన మీద దెబ్బేసాడు. గూన పగిలిపోయింది. సారా నేలపాలయింది. యిల్లంతా విప్పమొగ్గా. అమ్మోనియా పులిసిన ఘాటు వాసన!

అట్నుండిటొచ్చి, లాఠీ "ఊపుతూ, ''పద పదరా పదా...మరియాదగా" అని లాఠీతో తోస్తూ సొండోడిని సైకిల్ వద్దకి తీసుకెల్లాడు.

"ఓలమ్మో! ఓర్నాయినో! యిదేటీగోరం! బావో...జవానుబావో...ఒదిలీవా!" అని యేడుస్తూ సైకిల్‌కి అడ్డమొచ్చింది కాంతమ్మ!

సైకిల్ ముందు చక్రంతో కాంతమ్మని పొడిచి తోస్సాడు. కాంతమ్మ వెనక మారుగా కూలబడింది! లాఠీతో సొండోడి రెక్కల మధ్య పొడిచి "పదేస్" అని కదలబోయాడు జవాను.

ఇంతలో 'కాకితాడ' గ్రామ రక్షక దళం వచ్చింది. దళ కమాండరు 'సుక్కు' చేతిలో" గంద్రగొడ్డలుంది. మిగతా దళ సభ్యులందరి దగ్గరా తలో ఆయుధముంది. జగన్నాధరావు జవాను సొండోడింటి ముందు సైకిలాపి, స్టేండు వేసినపుడు అక్కడి నుండిబెదిరి పారిపోయిన గిరిజన్లలో కొంత మంది దళ స్థావరానికి కబురందించారు. కోడిపుంజులు పోగొట్టుకున్న 'పగడాలు' గూడా 'దళం' వెనకాల జనంలో వున్నాడు.

"యేయ్...పోలీసోడా! నిలబడక్కడ" సుక్కు కేకేసాడు!

కేక వినబడింది...కేక వచ్చిన దిక్కు చూసాడు జగన్నాధరావు! గోచీ తప్ప ఒంటిమీద యేమీ లేని మామూలు గిరిజనుడే! చూసినా పోలీసోడికి...పోలీసు కోప మొచ్చింది. "ఏరా...కొండోడా! నువ్వా వొత్తావేటి...టేసన్‌కి?" అడిగాడు. "టేసన్‌కి కాదుగానీ...నీ తాతల్దగ్గిరికెలిపోగలవు మల్లి...అని గంద్ర గొడ్డలెత్తి దగ్గ రకు వస్తోన్నాడు సుక్కు! జగన్నాధరావు నిలబడిపోయాడు! సుక్కు చేతిలో ఎత్తి పట్టుకున్న గంద్ర గొడ్డలి...వెనకాలే దళం చేతిలోని ఆయుధాలు చూసేసరికి జవాను కాళ్ళూ చేతులూ రక్తమాంసాలు లేని కర్రలయిపోయినాయి. సైకిల్ పడిపోయింది. జవానూ కొయ్యబారి పడబోతుంటే...దళంలో సభ్యుడొకాయన పడకుండా కాపు గాసినిలిపాడు. అంతా గలిసి జవాన్ని 'గ్రామకమిటీ' ఆఫీసుకి తీసుకు వెల్లారు!

స్పృహదప్పిన జవానుకి శుశ్రూషలు జేసి..స్పృహలోకి తెచ్చారు.తెలివొచ్చాక, లేచి కూర్చొని చుట్టూ చూసాడు.

చుట్టూ..గోచీ గుడ్డల..గిరిజనులు!

ఖాకీ గుడ్డల అలికిడికి అదిరిపడే...ఆ గిరిజనులే!?

తన వైపే చూస్తున్న ఆ జనం..కళ్ళల్లోకి చూసే ధైర్యంలేని జవాను...తల దించుకున్నాడు.

ఎదురుగా వున్న గ్రామ కమిటీ బాధ్యుడు జవానుతో "నిన్ను మా గ్రామ రక్షక దళం అరెస్టు జేసింది. నీ మీద విచారణ జరపటానికి...ప్రజాకోర్టు యేర్పాటు చేయవలసిందిగా మా కేంద్ర స్థానానికి కబురు పెడతాము. వారు కోర్టు యేర్పాటు చేసేదాక, విచారణ పూర్తయ్యేదాక నువ్వు మా ఖైదీవి. మేము ఖైదీలను మీలాగా బాధించము. గౌరవిస్తాము. ఛైర్మన్ మావో 'పట్టుబడ్డ ఖైదీలను గౌరవించి' మన్నారు. నీకు అన్ని సౌకర్యాలు....మాకున్న మేరలోనే గ్రామకమిటీ యేర్పాటు చేస్తాది. నీకు సంకెళ్ళుండవు....లాకప్పుండదు....సవాలక్ష ఆంక్షలుండవు. కానీ పారి పోడానికో, మరేదన్నా కుతంత్రానికో పూనుకున్నావో....అదివి అదివంతా నిన్ను చుట్టుముడతాది....మా దళం గొడ్డళ్ళకి నీ శరీరం బలయిపోద్ది" అని అన్నీ వివరించి హెచ్చరించాడు.

జగన్నాధరావుకి ప్రాణం పోయిందనీ, ఇదంతా మరో లోకంలో జరుగు తోందనీ అనుకున్నాడో క్షణం. మళ్లీ కళ్ళు గట్టిగ నులుముకొని, కాకీ గుడ్డలు నమ్మకానికై తడుముకొని, తన నెంబర్ గుర్తుకు తెచ్చుకొని తడుముకొని 'లేదు.... చచ్చిపోలేదు' అనే నిర్ణయానికొచ్చాడు. ఆ నిర్ణయానికి రాగానే మరోసారి గ్రామ కమిటీ బాధ్యుని వివరణ, హెచ్చరికా స్మరణలోకొచ్చాయి. "అమ్మనాయిన! గొడ్డలి ఎత్తీ ఎత్తగానే.... సచ్చాను, అయిపోయింది.... నావని! అనుకున్నాను. నొండోడు మాటల్లో పెట్టేసి యెంత దెబ్బ తీస్సాడు అనుకున్నాను.... రక్షించారు.... చంపీలేదు" అని మనసులో అనుకొని చేతులెత్తి దేవుడికో, ఎదురుగున్న గ్రామకమిటీ బాధ్యుడుకో అసంకల్పితంగా దండం బెట్టసాగాడు.

* * *

రెండు రోజులు గ్రామ కమిటీ నిర్బంధంలో వున్న జగన్నాధరావును, మూడో రోజు కేంద్ర స్థానం వారు యేర్పాటు చేసిన 'ప్రజాకోర్టు'కు తీసుకు వెళ్ళింది గ్రామ కమిటీ!

ఈ రెండు రోజులూ ఓ కొత్త లోకాన్ని చూసాడు జగన్నాధరావు. గిరిజన్ల లోని ఐకమత్యమూ, సంఘం నేర్పిన క్రమశిక్షణా వారి అడుగడుగునా కన్పిస్తోంది. రాత్రి పాఠశాలలో అక్షరాభ్యాసమే గాకుండా, రాజకీయాలు గూడా పట్టుదలగా నేర్పు

కుంటున్న గిరిజనులు ! బాలురలో గూడా గొప్ప మార్పు కనబడుతోంది. 'ఏమీ తెలీ నోళ్లు, గొడ్లో అంటే బెద్దందుకొనేరకం మనుషులు యేమి మారిపోయారు! యెంత క్రమశిక్షణతో, యెంత మంచిగా ఆలోచిస్తోన్నరు ! పోలీసు వాడి మీద ఎంత కక్ష, కావేశం వున్నా....యీ రెండు రోజుల నిర్బంధంలో యేమాత్రం అగౌరవ పరచని యీ గిరిజన్లకీ....నిర్బంధంలో చట్టాల్ని అతిక్రమించి దారుణంగా హింసించే పోలీసు జాతికి ఎంత భేదం ! ఏమి చిత్రం !" యిలా విస్మయం చెందాడు జవాను.

* * *

రాళ్ళూ, రప్పలూ దాటి.... ముళ్ళ బాటల్లోంచి; కొండలెక్కి, దిగి ... లివ్వగా 'ప్రజా కోర్టు' స్థలానికి వచ్చాక జగన్నాధరావు కళ్ళకి కట్టిన గంతలు విప్పారు. రెండు చేతులతోటి కళ్ళు నులిమి చుట్టూ చూసాడు జగన్నాధరావు.

విశాలమయిన మెరకభూమి ప్రజాకోర్టు. చుట్టూ దట్టమైన తుప్పాడొంకలు.... డొంకల్లో ఆయుధాలతో మాటుగాసిన గెరిల్లాలు !

చుట్టు ప్రక్కల గ్రామాల్లో ప్రచారం చేయటంతో దాదాపు నాలుగైదు వందల మందిదాక ఆడా, మగా చేరారు. ప్రజా కోర్టుకి ! ప్రజలే న్యాయవాదులు, న్యాయ మూర్తులు ! ప్రజాభిప్రాయమే న్యాయశాస్త్రం !

అందరూ కూర్చున్నాక, ముగ్గురితో కూడిన ఒక సాంస్కృతిక బృందం "ఓ అరుణ పతాకమా ! చేకొను మా రెడ్ శాల్యూట్ !" పాట ఉత్తేజంగా పాడారు. పాట పూర్తయ్యాక "భారత రైతాంగ సాయుధ పోరాటం వర్ధిల్లాలి" "విప్లవం వర్ధి ల్లాలి" "అమర వీరులకు జోహార్" నినాదాలు ....ఆ కొండల్లో మార్మోగాయి. బృందం.... వేదిక నుండి.... జనంలోకి వచ్చి కూర్చొన్నారు.

ప్రజల నుండే, ఒక కామ్రేడ్ లేచి "ఈ రోజు కాకితాడ గ్రామ కమిటీ అరెస్టు చేసిన దోపిడీ పాలకవర్గ పోలీసు జగన్నాధరావుపై విచారణ జరుపుటకు యీ ప్రజా కోర్టు యేర్పాటు చేయటం జరిగింది. యీ ప్రజా కోర్టును నిర్వ హించ వలసిందిగా ప్రియతమ కామ్రేడ్ సత్యం మేస్టారుని కోరుతూ" వేదిక మీదకు ఆహ్వానించాడు.

గిరిజన రైతాంగ ప్రియతమ నాయకుడూ, ఏజన్సీ కమిటీ కార్యదర్శి వెంప టాపు సత్యనారాయణే..సత్యం మేస్టారు అంటే,

ఉపాధ్యాయ సంఘం ద్వారా కమ్యూనిస్టు భావప్రభావితులై పార్టీతో పరిచయ మేర్పడిన వెంపటాపు సత్యన్నారాయణ..వృత్తిరీత్యా టీచరుగా ఏజన్సీకి వచ్చారు !

ఏజన్సీలో గిరిజనుల జీవితాన్ని, వారిపై జరుగుతున్న దోపిడీ..దౌర్జన్యాలను చూసి చలించిపోయారాయన. గిరిజనులలో కమ్యూనిస్టు సిద్ధాంతాలను, ప్రబోధిస్తూ, ప్రచారం గావిస్తూ..సంఘాలు నిర్మించారు.. కొండ..కొండా కదిలించారు. దోపిడీపై యుద్ధాన్ని ప్రకటించారు. వృత్తి, వ్యాపృత్తి అంతా ఉద్యమమే..విప్లవమే ఊపిరిగా జీవించే సత్యన్నారాయణ..మహాశక్తిగా రూపుదిద్దారు. గిరిజనుల గుండె..గుండె నిండి పోయారు..వారి ప్రియతమ నాయకులయ్యారు. కన్నబిడ్డలా కొండలన్నీ మేస్టార్ని కాపాడుతూ వస్తున్నయి !

గిరిజనులంతా ఆయన్ని "గురువు" అని పిలుస్తారు. పెద్దలూ, తోటి సహచర మిత్రులూ ఆప్యాయంగా "కా॥ వెంపటాపు" అంటారు. కొందరు "సత్యం మేస్టారని" పిలుస్తారు.

మేస్టారు, గురువు, వెంపటాపు..యిలా రకరకాలుగా, ఆప్యాయంగా, ఆదరంగా, ప్రేమగా, గౌరవంగా పిలువబడే మేస్టారు లేచారు,

జనం చప్పట్లు మ్రోగించి ఆమోదం తెల్పారు. సత్యం మేస్టారు వేదిక నలంకరించారు. కోర్టు నిశ్శబ్దమైంది. జగన్నాధరావు వేదిక ప్రక్క నిల్చున్నాడు.

సత్యం మాస్టారు లేచి నిల్చొని" ప్రియతమ ప్రజలారా ! కామ్రేడ్స్ !! ఈనాడు మనం మహత్తర కర్తవ్య నిర్వహణా బాధ్యతలో వున్నాము. అదేమంటే, దేశం యావత్తునీ పట్టి పీడిస్తొన్న నలుగురు రాక్షసులయిన..సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం, అమెరికన్ సామ్రాజ్యవాదం, దళార్లీ బూర్జువావర్గం, నిరంకుశ భూస్వామ్య వర్గాలతో యుద్ధం చేస్తున్నాము. మన ప్రియతమ నాయకుడు, కామ్రేడ్ చారు మజుందార్ బాటలో సాయుధులయిన మనం యీ దేశాన్ని మార్చాల ! ఈ దేశంలోని కన్నీళ్లను తుడవాల ! కష్టాలను కడగాల ! అక్రమాలనూ, అన్యాయాలను అంతం చేయాల ! ప్రజలకు నూతన రాజ్యం..దోపిడీ, పీడనలేని శ్రమజీవుల రాజ్యం నెలకొల్పాలి !

ఈ కర్తవ్య నిర్వహణలో, మనపార్టీ నాయకత్వములో అనేక కష్ట నష్టాలకూ, త్యాగాలకూ వెనుదీయని ఎందరో కామ్రేడ్స్..తమ రక్తంతో మన జెండాను మరింత

ఎరుపెక్కించారు. ! ఈ ఎర్రజెండా..యీ దేశాన్ని కదిలించింది..ఇక్కడి కొండ కొండనీ కదిలించింది !

ఇలాంటి సమయంలో, ప్రజలకు ద్రోహం చేసేవాళ్ళను, ప్రజల మీద అక్రమాలు జరిపే వాళ్ళనూ..చరిత్ర క్షమిస్తుందా ? ప్రజలకు శత్రువుగా నిలబడటం ఎంతనేరమో ఆలోచించండి.

అయితే, తెలిసో తెలియకో తప్పులు చేసే వాళ్ళను, ద్రోహులను మనం మనరీతిలో, ప్రజాకోర్టుల్లో విచారించి, శిక్షించాలి ! యిందులో భాగంగానే మన లక్ష్యాన్ని వివరించాలి ! అంచేతనే, యింత వివరంగా మీకు చెప్తూ. జగన్నాధరావు మీద విచారణ ప్రారంభిస్తున్నాను. ఇప్పుడు కాకితాడ గ్రామ కమిటీ వార్ని: పోలీసు మీద తాము సమర్పించిన ఆరోపణ పత్రాన్ని కోర్టు ముందు చదివి వినిపించ మని కోర్తున్నాను" అని సుదీర్ఘంగా తమలక్ష్యాన్నీ, జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్నీ వివరించి, కోర్టు నిర్వహణ ప్రారంభిస్తూ.. కూర్చున్నారు.

జగన్నాధరావు జవాను జీవితంలో ఎరుగని, ఆలోచించని, ఊహించని కోర్టు నిర్వహణ తీరు చూసి..ఎంతో సంచలించి పోయాడు.

గురువు ఆర్డరు దాక మాత్రమే కాకితాడ వాళ్ళు తనను ఉంచారనీ కేంద్రంకి తీసుకొచ్చాక, అందరిముందూ అన్ని గ్రామాల ప్రజల ముందూ...తన తలనరికేసి, ఆ తలని చెట్టుకక్కట్టి, దాని మీద హెచ్చరిక వ్రాసిన చీటీ వుంచుతాదనీ అనుకున్నాడు ! యేమంటే, యిలాంటి కథలే తను విన్నాడు....ఆవిన్న కథలవల్ల....తన కథ గూడా అలాగే ముగుస్తుందనే అనుకున్నాడు ! గానీ మేస్టారి ఉపన్యాసంలో వివరించిన లక్ష్యమూ; అందుకోసం వారూ....వారి నాయకత్వంలోని ప్రజలూ అనుసరిస్తున్న బాట, వారి త్యాగశీలతా....జవానులోని అంతరాత్మని కాకీ కరకు పొరలను చీల్చి బయటకు లాగాయి !

'కాకితాడ' గ్రామ కమిటీ పోలీసులపై "ఆరోపణ పత్రం" చదివారు. పగ దాలు దగ్గర గుంజుకున్న కోడి పుంజుల గూర్చీ సొందోడి మీద చేసిన దౌర్జన్యం గూర్చి మాత్రమే గాక గతంలో జగన్నాధరావు, వారి స్టేషన్ పోలీసులూ చేసిన అక్రమాలనేకం అందులో ఆరోపింపబడ్డాయి.

జగన్నాధరావుకి ఆరోపణ పత్రంలో అంశాలు కంటె యింకా నేరస్తంగా

తనూ, తన ఉద్యోగం కన్పించసాగింది. నేరభావంతో తల దించుకున్నాడు !

నేరారోపణ జరిగాక; సత్యం మేష్టారు లేచి జవానుని ప్రశ్నలు వేయసాగారు.

"నీ పేరు ?"

"జగన్నాధరావు...."

"యే స్టేషన్ జవానువి ?"

"ఎల్విన్ పేట...."

"యెందుకొచ్చావు కాకితాడ ?"

"..................."

"నీకు పిల్లలున్నారా ?"

"యిద్దరు కొడుకులూ....యిద్దరు కూతుళ్లున్నారు...."

భూమి పుట్టో యేమేనా వుందా ? నీ మీద వచ్చిన అరోపణలు విన్నావు కదా ! నువ్వు చెప్పదలచుకొన్నది. యేమన్నా వుంటే....చెప్పుకోవచ్చు...."

గొంతులో అనేకానేక భావోద్యోగాలు....మనసులో సంఘర్షణ! ఏమి చెప్పాలో....యెలా చెప్పాలో, తనలోని అంతస్సంఘర్షణని ఎలా విన్పించాలో అర్థంకాని జగన్నాధరావు....కూడ గట్టుకున్న స్థైర్యంతో, గొంతు సవరించుకొని.... సభకు నమస్కారమని చేతులెత్తి మొక్కుతూ...." మాకు భూమీ పుట్టా యేమీలేదు. మా పుట్టినూరు టెక్కలి తాలూకా "నందిగాం" అక్కడ మా తల్లీ దండ్రులు కూలీనాలీ జేసి....నన్నుచదివించారు. నాతోడబుట్టిన వారు యిద్దరన్నదమ్ములూ.... పాలేరికం చేసుకు బతుకుతున్నారు. ఒకచెల్లెలు మా మేనత్త కొడుక్కిచ్చి పెళ్ళి చేసాము. తల్లీ, దండ్రే శ్రమతోటి చదుకున్న నాకు మా మాఁవ పోలీస్ డిపార్ట్ మెంట్‌లో పన్జేసేవాడు....ఆయన పుణ్యాన యీ ఉద్యోగం వచ్చింది........"

"ఈ సోదంతా ఎందుకు....నేరారోపణ మీద సెప్పవయ్యా...." జనంలోంచి విసుగ్గా ఎవరో కేకలేశారు. "ఎక్కడలేని నంగనాచి గుణమూ యిప్పు డొచ్చింది రీడికి ....యింకెవరో విసుర్లు....! యిలా గుస, గుస, రణగొణ ధ్వనులు రాసాగాయి.

వెంటనే, సత్యం మేష్టారు లేచి "నిశ్శబ్దం" అని. కేకేస్తూ "ప్రియమైన కామ్రేడ్స్ ! అసహనం పనికిరాదు. అది కమ్యూనిస్టుల లక్షణం కాదు. పోలీసుకి

తగిన స్వేచ్ఛ యివ్వాలి. తన పైన ఆరోపణల మీద ఆయన చెప్పదలచుకున్నదీ, చెప్పేదీ అంతామనం వినాలి. దాన్ని పరిశీలించాలి. నిజా నిజాలు గ్రహించాలి. పక్ష పాతంగా ఏ మాత్రం వుండ గూడదు. యిది ప్రజాకోర్టు, బూర్జువా కోర్టులకీ....మన కోర్టులకీ... తేడా అన్ని విషయాలలోనా కనబడాలి....దయచేసి శాంతం వినండి" అని మరో సారి విజ్ఞప్తి చేసి కూర్చున్నారు.

ఎక్కడి గుస గుస అక్కడే సద్దు మణిగింది. అంతా జవానునే చూస్తూ.... కూర్చున్నారు.

జవాను ప్రారంభించాడు. "...నాకు ఉద్యోగం ఇప్పించటంతో పాటు, మా మామ తన కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేసాడు. ఉద్యోగం మొదటి రోజుల్ల నా కుటుం బాన్నీ, నా తల్లి దండ్రుల్నీ పోషించుకొచ్చే వాడిని రాను రాను ..యింట్లో బాధలు పెరిగాయి. పిల్లలు పుట్టారు. మా ఆవిడ మనసులో మా తల్లీ దండ్రిమీద ద్వేషం పుట్టింది. నా మనసులో.. పోలీసు జాతిగుణం పుట్టింది. అందరిలాగే మారిపోన్ను. అందినకాడికి కొట్టుకొచ్చి వోణి. అందల నాకు మిగిలిందేటిలేదు. మీకు తెలన్దేటి ! మా జీత మేపాటిది ? పిల్లలూ,. అదీ గాక, మా మీద ఆఫీసర్ల ఆర్డర్లెలాటివో మీరెరు గుదురు. మొత్తమ్మీద ఎవరి ప్రోద్బలమో, ప్రోత్సాహమో అని చెప్పటం కోసం కాదు యిదంతా నేను చెప్తున్నది..నేనెలాగ నేరాలు చేయటం జరిగిందో చెప్పాలనే యిది చెప్పాను. .ఏమయినా, నేను చేయరాని తప్పులే చేసాను. ఆరోపణ పత్రంలో వున్న నా నేరాలు వాస్తవమే. అందులో యేమీ అబద్ధంలేదు.

నాకు యింతదాక మాటలాడే అవకాశం వుంటాదని అనుకోలేదు. ఆ అవ కాశం యివ్వకుండానే.. శిక్ష వేస్తారనుకున్నాను.. కానీ మీరంతా గొప్పగా ఆలోచిస్తు న్నారు. గొప్ప న్యాయమైన రీతిలో నడుస్తోన్నారు.

..అందు చేతనే, మీ ముందు, ప్రజల మీద గొప్ప ప్రేమ గల మీ ముందు.. యీ మాటలు చెప్తోన్నాను. నాకు మీరే శిక్ష వేసినా..మీ యిష్టం..కానీ నా కుటుంబాన్నీ ముసలి తల్లి దండ్రుల్నీ అనాథలు జేయొద్దని..కోరుతున్నాను." ఒళ్ళంతా చెమటలు ధారాపాతంగా కారుతోంచే మనసులోని భావోద్దేశం యింత సేపు మాట్లాడించింది జగన్నాధరావుని !

మేష్టారు లేచి, జనం పైపు చూసి "కామ్రేడ్స్ ! ఆరోపణ పత్రంలోనే

గాక, అదనంగా యింకేమన్నా వున్నా.,జగన్నాధరావు సంజాయిష్ మీదా ఏమి మాట్లాడాలనుకున్నా..ఒక్కొక్కరూ వచ్చి మాట్లాడండి" అని ఆహ్వానించారు.

జనంలోన గొంతుకూర్చొని వున్న, సన్నగా పొడుగ్గా వున్న రసూల్ లేచి వచ్చి "కామ్రేల్లారా.. పోలీసోడిని నమ్మకూడదు. ఈలకి దయా, దాక్షిణ్యాలుండవు. ఒకపాలి.... కర్రల కావిడి అమ్ముకొందుమని, ఎల్విన్ పేటెల్లాను.... సరిగ్గా, ఈల ఓసన్ కాడికిరానిచ్చి, నా కర్రల కావిడి నాకుండ్రు పోలీసోల్లు! "ఓలమ్మ! యిదేటి బావ్....యీ గోరం! బియ్యం గింజలు నేవని, కర్రలమ్మడాం కొచ్చాను. కావిడి నాక్కాని.... నా కడుపు కాల్సికండి'' అనెంత బతిమాల్నానో! ఒక్కడు కనికరించనేదు....మనిసొక మాటాడి, లాఠీల్తోటి బీపిరేగ్గొట్టిసినారు!.... అంచేత పోలీసోడ్నిదిలీ గూడదని చెప్పదల్చుకున్నా''నని చెప్పి జనంలో కలిసాడు!

ఆడవాళ్ళ మధ్యలోంచి, నడి వయసున్న ''కొమలమ్మ'' లేచి అక్కడే నిలబడి మాట్లాడబోయింది.

జనం వేదిక ముందుకి వెళ్ళమని కేకేసారు.

కొమలమ్మ సిగ్గుతో, నవ్వేస్తూ.... ''యిక్కడై తేనే సెప్తాను.... లేపోతే కూకుండి పోతాన"ంది.

మేస్టారు ''సరే.... అక్కడ్నించే చెప్పు.... కామ్రేడ్" అన్నారు. "ఈ పోలీసు జాతి దుంపనాశనం అయిపోవాల! ఈ గండలేకదా... అప్పుడు మందకి మందెలి పోవొచ్చి మన వొలసలు బుగ్గి జేస్సారు, మా అడకూతుళ్ళ మానపేనాలు తీస్సారు.... అది గేపకమొత్తే, నా సెల్లెలు గేపకమొత్తే.... నా కళ్ళంట రత్తం పడతంది..." అని మరి మాటల్రాక, యేడుస్తూ కూర్చుండి పోయింది.

కొమలమ్మ చెల్లెలు.... రాజమ్మకి 'పెద్ద ఖర్జ' గ్రామం అరిక సామలుతో పెళ్ళయింది. ఆ రోజు వారిద్దరికీ శోభనం! సరిగ్గా ఆ రోజున.... 'పెద్ద ఖర్జ' మీద పోలీసులు దాడిచేసి సర్వనాశనం చేసారు. ఆ దుర్ఘటనలో 'రాజమ్మ'.... మాన ప్రాణాలు కోల్పోయింది.

ప్రజాకోర్టు ఒక్కసారి ఆవేశమయమైంది.

కోర్టులో మళ్లీ కలకలం చెలరేగింది. మనిషోమాట! తలా ఓ ఘటన! చెప్పుకోసాగరు. ఎవరో "జోహార్ అమరవీరులకు!" అంటే కోర్టంతా

"జోహార్ల"ర్పించింది. రైతాంగ పోరాటాలపై పోలీసుల దమనకాండ.... "నశించాలి" కొండ కొండా ప్రతిధ్వనించింది !

ఈ వాతావరణంలో కాకితాడ గ్రామరక్షక దళం లేదకాండరు, సుక్క లేచి వేదిక ముందుకొచ్చి "యీనాడు యీ పొలసల్ల మద సంగబలం యింతగా వున్నా.... యీ పోలీసోడు వొచ్చాడు. మామూళ్ళ కోసమొచ్చాడో... మరే అంతకం చెయ్య డాంకొచ్చాడో.... యెందుకొచ్చాడన్నది చిన్న యిసయం కాదు. యిప్పుడు మించి పోయింది పరిస్థితి అని గుడ్లు తేలేస్సి, నానే పాపమెరగనంతండు గుడ్డి కొంగలాగ ! లాభం నేదు. ఈడ్ని.... యీడి పాపాలకి శిచ్చగా.... యీ కోర్టు ముందు చంపాల!" అని ప్రకటించి.... జనం వైపు చూస్తూవచ్చి జనంలో కూర్చున్నాడు !

జనంలో "అవును....అవును....చంపాల" కేకలు !

జగన్నాథరావు జవానుకి సుక్క ప్రకటనతో, జనం కేకలుతో పై ప్రాణాలు పైనే పోయాయి. అదివినీ కొండనీ చూసాడు. ఆకాశాన్నీ... భూమినీ తల్చాడు. ఏడుకొండలవాడినీ.... ఎవరెవర్నో తలపు కొచ్చిన దేవుడ్నీ, దేవతనీ తలచాడు. న్యాయమూర్తి వైపు దీనంగా చూస్తూ... తడారిపోయిన గొంతుతో కోర్టులో కూర్చున్న ప్రజలందరికీ చేతులెత్తి మొక్కుతూ.... "లేదు ...నాయనలారా ! లేదు..నా దురుమార్గాన్నీ, నా జాతి దురుమార్గాన్నీ క్షమించగూడదు. నిజమే....కాదన్ను.... అంతటి పాపాలే చేసాము. కానీ మీరు ఉన్నతమైన ఆలోచన గలవారు. నా పరిస్థితీ, నా కుటుంబ పరిస్థితీ ఆలోచించమంటన్నాను. మీరంతా నా తల్లీ దండ్రీ లాంటోళ్ళు ! నా తల్లీ దండ్రీ తమ బతుక్కి యెంత బదవజేసారో; యెన్ని బాధలు పడ్డారో నేనెరుగుదును. యిప్పుడికీ.... ఆ బాధలు పోలేదు. మాతోటే వున్నాయి. మీరు బాధలు పోడానికి యుద్ధం చేత్తండ్రు ! మీ యుద్ధం నాకూ, నా తల్లిదండ్రులకూ లాభమే గానీ నష్టం కాదు ! యికబట్టి... యీ నేలతల్లి యీ అడివితల్లి సాక్షిగా చెప్తన్నాను. నేనెలాటి దురుమార్గప్పనీ చెయ్యను.... చెయ్యను గాక చెయ్యను. మని సిగా యికబట్టి బతుకుతాను....నన్ను బతికించండి.... నా పిల్లా జెల్లా....కుటమాంవి అనా థలు జేసీకండి" అని యేడుస్తూ మొత్తుకోసాగాడు.

జగన్నాథరావు సంజాయిషీ, క్షమాపణ, ఆవేదన కోర్టులో చర్చ నీయాంశ మైంది. కొందరంతా నాటకం 'పోలీసోడీ టక్కుల్ని లెక్కచెయ్యొద్దు. యీడ్నిప్పు

వొదిలేస్తే....తన బలగం బలగాన్నెంటేసుకొచ్చి వొలసలి మీద పడతాడు....ఈదొన్నె దలగూడదు" మరి కొంతమంది "నిజంగానే పోలీసోడు మారిపోయాడు. తనను తానే అసహ్యించుకుంటున్నాడు. ఎంతయినా మన పేద వర్గంనుండే వచ్చాడు కదా. చూద్దాం....ఈ సారికి వొదిలిడమే మంచిది" అనీ కోర్టులో కోలాహలం.

కోర్టు వేదిక ముందుకొచ్చి యిలా వాదనలు విన్పించారు కూడా కొంతమంది. అయితే ఏదీ అచ్చితంగా తేలలేదు. అందరూ జవాన్ని 'శిక్షించాలా? ...ఒదిలీయాలా?' చర్చలో తమతమ భావాల్ని ప్రకటిస్తూ, చర్చిస్తూ ...కోలాహలంగా వున్న సమయంలో న్యాయమూర్తిగా అందరి అభిప్రాయాలూ, ముద్దాయి సంజాయిషీ విన్నాక సత్యం మేస్టారు నిల్చొని, శాంత గంభీర స్వరంతో 'కామ్రేడ్స్! జవాను సంజాయిషీ విన్నాక, మీ ఫిర్యాదులు, వక్తల అభిప్రాయాలూ విన్నాక ఒక విషయం అర్థమవుతోంది! మన ఫిర్యాదుల్లో అధిక భాగము పోలీసు వర్గాలు చేసిన దురంతాలే తప్పా ....యీ జగన్నాధరావు ఒక్కడూ చేసినవికావు. అయితే నది ఎంత స్వచ్ఛమయిన దయినా....మహా సముద్రంలో కలిస్తే అది ఉప్పనయి తీరుతుంది. అలాగే జగన్నాధరావూ దురంతాలు చేసి వుంటాడు.

శాస్త్రీయంగా ఆలోచించే మనం ఎవరు యే పనిచేసినా ఆ పని ఎందుకు చేస్తున్నారో పరిశీలిస్తాం. దోపిడీ పాలక వర్గాలకు యిట్లాంటి పోలీసులు కాళ్లూ చేతులు నిరంకుశ అధికార్ల చేతిలో వీరు ఆట బంతులు! అయితే వీరు మన పేద వర్గానికి చెందిన వారన్నది గుర్తించాలి మనం.

తెలిసో, తెలియకో; బ్రతుకు తెరువు పేరిటనో యిలాంటి వారు తప్పులు చేస్తే....వాట్ని వారి దృష్టికితెచ్చి సరిదిద్దుకోమని చెప్తాము. ఆ రకంగా మంచికి మీరెందుకు అవకాశమివ్వాలి! యేమంటే....వీరూ పేదవారే గనక!

మన ఉమ్మడి శత్రువు దోపిడీ వర్గాలు! ఉమ్మడి శత్రువు మీద పోరాటం చేస్తున్న మనకు మన కష్టనష్టాలు వుంటాయి. అయితే; యీ జగన్నాధరావుని విడిచి పెట్టినంత మాత్రాన అదనంగా వచ్చే కష్ట నష్టాలేమీ వుండవు. నిరంకుశ పోలీసు శక్తుల వలయంలోనే....మనం ఉద్యమాన్ని రక్షించుకుంటున్నాము కాదా యీనాడు!

అంచేత, పేద వర్గానికి చెంది....నికృష్ట జీవనం సాగిస్తోన్న యీ జగన్నాధరావు జవానుకి ప్రాణభిక్ష పెట్టి....మంచిగా మారేఅవకాశం యిద్దాము. ప్రజల బాధల్ని

పోరాటాల్ని అర్థం చేసుకొనే అవకాశం యిద్దాము. మంచి మార్గానికి, ప్రజల మిత్రుడుగా మారేడా సరేసరి! లేదంటే, గత తరహా జీవితాన్నే కొనసాగిస్తే...మన గెరిల్లాల కత్తులకు, పీడిత జన క్రోధాగ్ని జ్వాలలకూ బలవక తప్పదు—ఏమంటారు"? అని సుదీర్ఘంగా వివరించి, ప్రశ్నించారు.

ప్రజా కోర్టులో మేస్టారి ఉపన్యాసం, ప్రశ్నా అందర్నీ ఆలోచింపజేసింది. "అవునవును, గురువు చెప్పిందే గురయ్యింది. పాపం పేదోడు ... పిల్లలు గలోడు" అనే సానుభూతి శబ్దాలు పెరిగాయి.

జనంలోంచి, కోర్టుని నిర్వహించవలసిందిగా మేస్టార్ని ఆహ్వానించిన కామ్రేడ్ లేచివచ్చి "ప్రియతమ ప్రజలారా! గురువు చెప్పిన అంశాలు విన్నారు కదా! ఉత్తమ లక్ష్యానికి అంకితమయిన మనం అ ఉన్నత భావంతోనే ఆలోచించి... యిప్పటికి జగన్నాథరావుని క్షమించి.... విడిచిపెట్టడం మంచిదిగా భావిస్తున్నాను. మీకు అంగీకారమైతే, చప్పట్ల ద్వారా ఆమోదాన్ని తెల్పుకోరుతున్నాను; అంతేగాక ఎవరికైనా అభ్యంతరమున్నా, యీ వేదిక వద్దకు వచ్చి తెల్పగోర్తున్నాను" అని చెప్పారు.

జనంలోంచి ఆమోదం "చప్పట్ల" మ్రోతల్తో ధ్వనించింది. అంతా జగన్నాథ రావుని మిత్రుడిగానే, సానుభూతిగా చూడసాగారు.

జగన్నాథరావు చచ్చి బ్రతికినట్లయ్యాడు! పాత పోలీసు జీవితం అంతా చచ్చిపోయింది! యిప్పుడు జనం ముందున్న జగన్నాథరావు కొత్త వ్యక్తి! ఆ వ్యక్తిని పూర్వంలో తాకీగుడ్డలు గుండెల్నీ, గుండెలోని కరుణనీ మానవత్వాన్నీ కప్పి వేయలేవు. లాఠీ, బూటులు దర్పం చూపలేవు. నోరు బూతులు పలుకలేవు. మొత్తం జగన్నాథరావు రూపం, భావం మార్పయ్యింది! జల, జలా కన్నీటిబొట్లు రాలుస్తూ, అందరివైపూ ఆరాధనగా చూస్తూ "నన్ను క్షమించిన మీ గొప్పతనం, మీ ఉన్నత ఆదర్శం తెలుసుకున్నాను. మీరు గెలుస్తారు. ప్రజలుగెలుస్తారు. ప్రజా పోరాటం వర్థిల్లుతుంది...."ఆవేశభరితంగా పిడికిలెత్తి పలకసాగాడు. యీ మహత్తర ఉద్యమానికి తన విధిగా జవాను తన జేబులో వున్న 'ఇరవై నాలుగు' రూపాయలూ కోర్టుకి సమర్పించుకొన్నాడు.

జనంలోంచి ఎవరో "ప్రజాకోర్టు .... వర్థిల్లాలి" "సంఘం .... వర్థిల్లాలి". "సాయుధ పోరాటం....వర్థిల్లాలి" అరిచేరు. ప్రతిగా జనం గొంతులన్నీ నినదించాయి. వాటితో పాటుగా జగన్నాథరావు గొంతూ అసంకల్పితంగా వంతు పలికింది....బను లుగా కొండ కొండా ప్రతిధ్వనించింది!

అమర్.

సికింద్రాబాద్ స్టేషన్ నుండి కరీంనగిర్ పట్టణానికి పొయ్యే మార్గంలో, ఓ 10 కిలోమీటర్ల దూరంలో ఉన్నది ఆ ఊరు. ఆ రోజు పొద్దున ఏడింటినుండే ఊళ్ళో ఉన్న బస్‌స్టాండ్ దగ్గర కోలాహలం మొదలయింది. అల్వాల గ్రామ పంచాయితి కింద ఉన్న ఆ ఊరి పేరు వెంకటాపురం. మొత్తం మూడు బ్లాకులు కలిపి ఆ ఊరి జనాభా 20 వేలకన్న మించదు. ఆ రోజు అక్టోబర్ 2. పొద్దున ఏడింటికే బస్‌స్టాండు ముందు ఖాళీ ప్రదేశంలో జనం గుమిగూడటం ప్రారంభించారు. మైకులు తెలుగు సినిమా పాటలతో చెవులు చిల్లులు పొడవడం లేదు. గాంధీగారి మార్కు గ్రామ రాజ్యానికి సంబంధించిన సందడేమీ లేదక్కడ. జాతిపిత పుట్టిన రోజు కూడా కాదు. న్యాయాన్ని నాలుగు గోడల మధ్యనుండి జనం మధ్యకు తేవడానికి జరుగుతున్న ప్రయత్నమది.

బస్‌స్టాండ్ షెల్టర్ మీద కూర్చుని తీరుబడిగా బొగ్గు నములుతూ జూస్తున్న ముసలివాళ్ళు, ఏంజరుగుతుందీ అనే ఆతృతతో మట్టిలోనే ఒళ్ళో చిన్నపిల్లలను వేసుకుని కూర్చొన్న స్త్రీలూ, న్యాయం ఇక్కడే జరగాలి అన్న పట్టుదల నిండిన భావాలతో యువకులూ ఒకక్కొకళ్ళు అక్కడికి చేరుకుంటున్నారు. ఆ రోజు అక్కడ ఒక ప్రజా న్యాయస్థానం జరగనున్నది. ఆ విషయం తెలిసి అక్కడికి చేరుకున్న విలేకరులకు నల్లకోటు న్యాయమూర్తిగారు కానీ క్లయింట్‌ను గెలిపించుకోవాలని కాని తపనపడే న్యాయవాదులుకానీ కనిపించలేరు. ఉక్కిరిబిక్కిరి చేసే మౌనం నిండిన కోర్టుహాలూ లేదు. బస్టాండ్ ముందు ఆరుబయలే కోర్టుహాలు, ముద్దాయి చిట్టేల సత్యనారాయణ, న్యాయంకోసం జనం ముందు నిలబడ్డ బాధితుడు మల్లేశం. ఇక న్యాయమూర్తి ఎవరు ? జనమే. విచారణ మొదలయే ముందు రాడికల్ యువజన సంఘం జంట నగరాల శాఖ అధ్యక్షుడు జనానికి మొత్తం కేసును వివరించాడు.

20 ఏళ్ళ పోశమల్లు మల్లేశ్ వెంకటాపురం గ్రామంలోవి వ్యవసాయదారుడు చిట్టేల సత్యనారాయణ దగ్గర రెండు నెల్లకింద జీతగాడిగా చేరాడు. సత్యనారాయణ ఆయన కుటుంబ సభ్యులూ ఏదో ఒక వంకపెట్టి తరచూ మల్లేశ్‌ను కొట్టడం హింసించడం మొదలుపెట్టారు. బాధలు తట్టుకోలేక మల్లేశ్ మెదక్‌జిల్లా సిద్దిపేట తాలూకాలోని తన సొంత ఊరు దొమ్మాటకు పారిపోయాడు. ఇది జరిగాక సెప్టెంబర్

14వ తేదీన చిట్టీల సత్యనారాయణ మరో ఏడుగురితో కలిసి స్కూటర్ల మీద సిద్ధిపేటకు పోయి మల్లేశ్‌ను బలవంతంగా నగరానికి తీసుకొచ్చారు.

జీతగాడు మేకలు ఎత్తుక పోయిండని ఒక ఆరోపణ పెట్టాడు సత్యనారాయణ మల్లేశ్‌ను అర్రలేసి కట్టెలూ, కడ్డీలతో ఇష్టం వచ్చినట్టు కొట్టారు. చచ్చిపోయిం డనుకుని స్పృహతప్పిన మల్లేశ్‌ను ఓ లారీలో పారేసి సిద్ధిపేటకు పంపారు.

"మల్లేశ్‌ను దొర కొట్టి చంపిండట' అనే వార్త వెంకటాపురం అంతా గుప్పు మన్నది. రాడికల్ యువజన సంఘం, జననాట్యమండలి వాళ్లు ఈ విషయంలో ఊళ్లో వెంటనే పోస్టర్లు వేసారు. దొర మీద బహిరంగ విచారణ జరపాలని రాడికల్స్ వేసిన పోస్టర్ సత్యనారాయణ గుండెల్లో దడ పుట్టించింది. ఊరొదిలి పారిపోయాడు. ఆ తరువాత సత్యనారాయణ తన భార్య ద్వారా, ఇతర బంధువుల ద్వారా రాడికల్ యువజన సంఘంతో సంప్రదింపులకు దిగొచ్చాడు. సెప్టెంబర్ 23వ తేదీన ప్రజా కోర్టుకు హాజరౌతానని కూడా ఒప్పుకున్నాడు. తాను జీతగాడు మల్లేశ్‌ను తీవ్రంగా కొట్టి హింసించి స్పృహలేని పరిస్థితిలో లారీలో వేసి పంపినట్టు వేలాదిమంది హాజరైన ప్రజాకోర్టులో సత్యనారాయణ ఒప్పుకున్నాడు. "నేను మల్లేశ్‌ను కొట్టిన మాట వాస్తవమే. కానీ ఇప్పుడు అతనేమైపోయాడో మాత్రం నాకు తెలియదు" అని అంగీకరించాడు.

సత్యనారాయణకు జనం నెలరోజులు గడువు ఇచ్చారు. మల్లేశ్ ఏమైపో యిందీ కనుక్కొనే పని అప్పగించారు. రాడికల్ యువజన సంఘం యువకులు తాము కూడా మల్లేశ్‌ను గురించి ఆచూకీ కనుక్కుంటామన్నారు. చివరకు రాడికల్స్ మల్లేశ్‌ను ఆయన సొంత గ్రామంలో కనుగొన్నారు. శరీరంనిండా గాయాలతో దాదాపు కదల్లేని పరిస్థితిలో ఉన్న మల్లేశ్‌ను నగరానికి తీసుకొచ్చారు.

అక్టోబర్ రెండవ తేదీన మళ్ళీ ప్రజా న్యాయస్థానం సమావేశమయింది చుట్టు పక్కల రెండు మూడు గ్రామాలనుండి జనం పొద్దున్నే వెంకటాపురం చేరుకున్నారు. జన నాట్యమండలి డప్పుల చప్పుడు మధ్య విచారణ మొదలయింది. జరిగిందంతా ఆర్ వై ఎల్ అధ్యక్షుడు వివరించాక మల్లేశ్ లేచి జనానికి తన శరీరంమీద గాయాలు చూపించాడు. తనను దొర, ఆయన మనుషులూ తీసుకొచ్చి ఎట్లా హింసిం చిందీ చెప్పాడు. నోరు విప్పి మాట్లాడటానికే కాదు ఏడ్వడానికి కూడా ఓపికలేని

మల్లేశ్‌ను చూసి జనంలో ఆవేశం పెరిగిపోయింది. ముందు వరసలో కూర్చొన్న ఒక అవ్వ మల్లేశ్ వివరాలు అడుగుతున్నది.

"ఏంది బిడ్డా నువు మ్యాక లెక్క బోతివి అమ్ముకుంటివి, అందుకే దొర పట్టు కొచ్చి కొట్టె" అని 'కొట్టి చూసింది'.

అవ్వా నాకేం తెలియదు నేను నిర్దోషినని చెప్పుకునేందుకు కూడా మల్లేశ్‌కు ఓపిక లేదు, కళ్ళుమాత్రం జలసముద్రాలైనాయి, స్వచ్ఛంగా చూసిన వీళ్ళందరికీ ఆ కళ్ళలో నిజాయితీ కనిపించింది. మల్లేశ్ కూర్చొన్నాక చిట్టీల సత్యనారాయణ జనం ముందుకొచ్చాడు. "నేను మల్లేశ్‌ను కొట్టిన మాట నిజమే, అది నా తప్పే, నా నెత్తి మీద శని గూసున్నది, అందుకే కొట్టిన, చచ్చిపోయిండనుకున్న, దండుగ గడ్తనన్న, ఇప్పుడు కూడ దండుగ గడ్త, వాన్ని నా తమ్మునోల్లె చూస్కుంట. కానీ నన్నింత నిలదీస్తున్నారు. వాడు నా మ్యాక లెత్తుక పోయిండు, ఆ విషయం ఎవ్వరు అడుగుత లేరు, అంత నాదే తప్పంటరు గాని వాన్నేమనరు". చిట్టీల సత్యనారాయణ మాటలకు అడ్డువేస్తూ జనం పెద్ద పెట్టున అరిచారు. "మేకలెత్తుక పోయిండే అనుకుందాం, చావ గొట్టాల్నని రూలున్నదా, ఏడనన్న" అని నిలదీసారు.

నాది తప్పేనని ఒప్పుకుంటాన గద, నాకు వీళ్ళ పార్టీ కి ఇంత బలమున్నదని ఇంతదనక తెల్వది, నా మీద ఇగ పగ బెట్కోకుండ్రి, మరిచిపోండ్లి, వాన్ని నా తోడ బుట్టినోనోలికె సూసుకుంటా" అని సత్యనారాయణ మైకు తిరిగి రాడికల్స్ చేతి కిచ్చేసిండు.

జనంలో మళ్ళీ చర్చ, దండుగ ఎంత కట్టించాలి. కొందరు 10 వేల రూపాయ లన్నారు, మరి కొందరు ఆటోరిక్షా కొనియ్యమన్నారు. ఇంకొందరు మల్లేశ్ పనిచేసే పరిస్థితిల లేదు కాబట్టి ఒక పాన్ డబ్బా పెట్టియ్యమన్నరు ఎంతకూ తెగడంలేదు. చిట్టీల సత్యనారాయణ మళ్ళీ మైకు అందుకున్నడు. వెయ్యి రూపాయలు మల్లేశ్‌కు ఇస్తానని చెప్పిండు. జనం మళ్ళీ గొడవ చేశారు.

రాడికల్ యువజన సంఘం అధ్యక్షుడు శ్రీనివాస్ అప్పుడు కల్పించుకుని "గతంలో అంటే సెప్టెంబర్ 23వ తేదీన ప్రజా న్యాయస్థానం ముందు చిట్టీల సత్యనారాయణ మల్లేశ్ బ్రతికి ఉన్నా, చనిపోయినా ఐదువేల రూపాయలు ఇస్తానని ఒప్పుకున్నాడు. ఇప్పుడా మొత్తం ఇవ్వడమే న్యాయం" అన్నాడు. జనం కూడా

ఔను ఐదువేలు ఇయ్యాల్సిందేనన్నారు. ఇంతలో జనం మధ్యలో నుండి ఒక యువకుడు లేచి ఇయ్యాల ఐదు వేలిచ్చి రేపు మల్లా వాన్ని చావగొట్టరని భరోస ఏందని ప్రశ్నించిండు. జనంలో మళ్ళీ కలవరం. చిట్టీల సత్యనారాయణ మళ్ళీ హామీ ఇచ్చిండు. నేను ఈ ఊళ్లెనే మీ మధ్యనే ఉంట, వాని మీద పగబెట్కోను, నా మీద కూడ మీరెవరూ పగ బెట్కోవద్దు, ఐదు వేలూ అన్నమాట ప్రకారం ఇచ్చేస్త, నా మీద కేసు మాఫ్సచేయించుండి" అన్నడు.

అకారణంగా కొట్టి, హింసించి మల్లేశ్ కదలని దుస్థితి కల్పించినందుకుగాను సత్యనారాయణ మల్లేశ్‌కు ఐదువేల రూపాయలు దండుగ కట్టాలనీ, సిద్దిపేటలో సత్యనారాయణ మీద మల్లేశ్ దాఖలు చేసిన కేసు ఉపసంహరించుకోవాలనీ జనం తీర్పు చెప్పారు.

పోలీసులు లేరు, నల్లకోట్లు లేవు, 'లా' పుస్తకాల అవసరమూ లేదు, జనం ఉన్నారు, బాధితుడున్నడు, నిందితుడున్నడు. తీర్పు న్యాయంగా జరిగింది. ఇదంతా జరుగుతున్న మూడు గంటలసేపు ఆ ప్రాంతాల్లో ఎక్కడా ఒక్క ఖాకీ డ్రస్ అయినా కనిపించక పోవడం కూడ విలేకరులకు ఆశ్చర్యం కలిగించింది. అరుదైన ఈ అనుభవాన్ని పాఠకులకు కూడా పంచివ్వాలన్న ఆతృతతో పత్రికాఫీసులకు ప్రయాణమయ్యారు. (ఆ వార్త ఎన్ని పత్రికలు ప్రచురించాయి? అనేది వేరేప్రశ్న)

---

## సవరణ

రంగనాయకమ్మగారిపై, 'గంజాయిదమ్ము' వ్యాసం విషయంలో కొమ్మూరి వేణుగోపాలరావు వేసిన పరువునష్టం దావా విషయంలో అక్టోబర్ సృజనలో వచ్చిన వ్యాసంలో ఒక పొరపాటు దొర్లింది. అది

"కొమ్మూరి ఇరవై వేల రూపాయలుగ అంచనా వేసిన ఈ పరువు నష్టం కేసులోనే తోడ్పడారు రంగనాయకమ్మ గారికి వెయ్యి రూపాయలు జరిమానా ( లేదా 3 నెలల సాధారణ ఖైదు) విధించారు" అని కానీ ఈ కేసు ఇరవై వేల పరువు నష్టం కేసు కాదు. ఇరవై వేలో అడిగింది. సివిల్ కేసు. అది ఇంకా జరగవలసి వుంది. ఇప్పుడు జరిగింది క్రిమినల్ కేసు ఇందు లో ఫైన్‌గా వెళ్ళిన వెయ్యి రూపాయలు కోమ్మూరికి కాక కోర్టుకు వెళ్ళాయి. ఇరవై వేల కేసూ, ఈ కేసూ వేరువేరు కేసులు.

కానీ, వార్తలో ఆ వాక్యం అలా వుండడంవల్ల విషయం స్పష్టంగా అర్థంకాక పోవడమే కాక ఒక అపార్థమొచ్చే అవకాశం వుంది వేణుగోపాలరావు ఇరవై వేల కోసం కేసు పెడితే కోర్టుమాత్రం ఒక్క వెయ్యి రూపాయలే ఇప్పించిందని (శిక్షవేసి నప్పటికీ కొంతన్నా సరిగానే చేసి కోర్టు ఒక్క వెయ్యితోనే సరిపెట్టిందనీ) పాఠకులు అనుకోవచ్చు ఈ క్రిమినల్ కేసు కొమ్మూరి పక్షం అయినట్లు సివిల్ కేసుకూడ అయితే రంగనాయికమ్మగారు ఇరవై వేల రూపాయలు కొమ్మూరికి చెల్లించాల్సి వుంటుంది. ఈ విషయం పాఠకులు సరిగా గ్రహించాలని మనవి. —సాహితీ మిత్రులు.

# కాజీపేట దొరల దోపిడీ, దౌర్జన్యాలు నశించాలి !

ప్రజలారా ! కాజీపేట దొరల దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడడానికి సిద్ధంకండి !

ప్రి య మై న ప్ర జ లా రా :

నర్సాపూర్ తాలూకాలోని కాజీపేట, తుజాల్‌పూర్, రాజీపేట, లింగాపురం గ్రామాల పేద ప్రజానీకాన్ని కాజీపేట దొరలు రామిరెడ్డి, వెంకటరెడ్డి, నారాయణరెడ్డి, మల్లారెడ్డిలు కలిసి విపరీతంగా దోపిడీ, పీడనకు గురిచేస్తున్నారు. ఒకప్పుడు వీరి తండ్రి చెన్నారెడ్డి, కొండాపూర్ నుండి కాజీపేటకు యిల్లటం వచ్చినపుడు చిప్ప చేతపట్టుకొని వచ్చాడు. వీడి మామ ఎల్లారెడ్డి చనిపోగా అతని ఆస్తి 5 ఎకరాలు, ఒక దున్నపోతు, ఒక గుడ్డి ఎద్దు చెన్నారెడ్డికి సంక్రమించాయి. చెన్నారెడ్డి అనేక దోపిడి పద్ధతుల ద్వారా అన్యాయంగా 60 ఎకరాలు సంపాదించాడు. చెన్నారెడ్డి చనిపోయిన తరువాత 60 ఎకరాలను అతని నలుగురు కొడుకులలో ముగ్గురు రామిరెడ్డి, నారాయణ రెడ్డి, మల్లారెడ్డి కలిపి పంచుకున్నారు. నాల్గవవాడు వెంకటరెడ్డి లింగాపూర్‌కు దత్తత పోయిండు ఈ రోజు ఈ నల్గురి ఆస్థి కలిసి 400 ఎకరాలకు మించి వుంటుంది, కాజీ పేట్, తుజాల్‌పూర్, రాజీపేట్, లింగాపురం గ్రామాల పేదప్రజానీకాన్ని దోపిడికి గురిచేసి, పై 400 ఎకరాలను సంపాదించారు. దేవునిమాన్యం, పోరంబోకు గౌటాన్, లావారిస్ భూములనే కాకుండా ప్రజల పట్టా భూములను కూడా అన్యాయంగా ఆక్ర మించారు. పైరవీ, పేర్లతో ప్రజలవద్ద డబ్బులు గుంజడం, ప్రజలకు అప్పులిచ్చి దొంగ లెక్కలు వ్రాసి అధిక మొత్తములో తిరిగి ప్రజల నుండి వసూలు చేయడం, ప్రజలమధ్య తగవులుపెట్టి పంచాయితీల పేరుతో జుర్మాలు వసూలు చేయడంవంటి దోపిడీ పద్ధతులద్వారా ఈ రోజు లక్షలకు అధికారులయ్యారు. కాజీపేట సర్పంచ్ పదవిని చేజిక్కించుకొని, దొరికిన అధికార అహంభావంలో ధనబలంతో వీరు ప్రజలపై విపరీతంగా దౌర్జన్యాలు చేస్తున్నారు. వీరి దుర్మార్గాలను ఎదిరించిన ప్రజ లను కొట్టడం తిట్టడం, వారి పశువులను తమ గడిలో గట్టివేసి జుర్మానాలను వసూలు చేయడం వంటి పద్ధతులతో ప్రజలను అనేక విధాల బాధలకు గురిచేస్తున్నారు. వీరి బాధలు పడలేక ఊరు విడిచి వెళ్ళిపోయిన గ్రామస్థుల ఇండ్లను భూములను, ఇతర ఆస్తులను అక్రమంగా ఆక్రమించుకుంటున్నారు. ఊర్లోని చింతచెట్లు, మామిడిచెట్లన్ని వీరు ఉపయోగించుకోవలసిందే. గ్రామ డీలర్‌షిప్ కూడా యింకెవరికి పోనీయకుండా

వీరే స్వంతం చేసుకొని, గ్రామానికి వచ్చిన కోటాను ప్రజలకివ్వకుండా అమ్ముకుంటున్నారు. చివరికి ఊరి పోస్టుమాస్టర్ ఉద్యోగం కూడా వీళ్ళ కుటుంబమే దక్కించుకుంది. ఈ నలుగురు దోపిడి దొంగలలో నారాయణరెడ్డి, మల్లారెడ్డిలు కలసి పేదప్రజలపై చేస్తున్న దౌర్జన్యాలు మరీ దుర్మార్గమయినవి.

**కాజీపేట గ్రామములో నారాయణరెడ్డి చేస్తున్న దోపిడి దౌర్జన్యాలు ;**

1. పైరవీల పేరుతో ప్రజల నుండి డబ్బు గుంజడం :

* గూడ్ సొసైటీ నుండి అప్పు తెస్తాననే పేరుతో తుజాల్‌పూర్, మంతూర్, రాజీపేట గ్రామాలలోని 100 మంది రైతుల దగ్గర ఒక్కొక్కరి నుండి రూ. 100/—చొ॥ మొత్తం రూ. 10,000/—ల వరకు వసూలుచేసి, సొసైటీ నుండి రూ. 80,000/—ల విలువగల చెరుకు క్రషర్లు, ఆయిల్ యింజన్లు, బెల్లం వండే కడాయిలు వగైరాతెచ్చి ప్రజల కివ్వకుండా తానే స్వంతంగా వాడుకున్నాడు.
* తుజల్‌పూర్, మంతూర్, కాజీపేట ఊరిబావులకు కరెంటు తెస్తాననే పేరుతో కాజీపేటలోని 100 మంది రైతుల దగ్గర ఒక్కొక్కరి నుండి రూ.126/-ల చొ॥ 12,000/-ల వరకు వసూలుచేసి 13 కరెంట్ మోటార్లను తానే తెచ్చు కున్నాడు. తిరిగి ప్రజలు తమ బావులకు కరెంట్ అడిగితే ఒక్కొక్కరి నుండి ఒక పోలుకు రూ. 1000/- ల చొ॥ న వసూలుచేసి కరెంటు యిచ్చాడు.
* ఊర్లోని వెనుకబడిన కులాల వారికి కారిత్ భూములు, పొరంబోకు భూములను పట్టా చేయిస్తానని చెప్పి మొత్తం రూ. 12,000/—లను వసూలు చేసి, పట్టాలు లేకుండా డబ్బులను దిగమింగాడు.
* కల్లు మాముల తీసుకవస్తానని చెప్పి, గౌండ్లవారిని అడిగి ఒక్కొక్కరికి రూ. 100/—ల చొప్పున రూ. 1400/—లు వసూలుచేసి, తిరిగివాళ్ళకి రూ. 14 000/—ల కమీషన్‌కు అమ్ముకున్నాడు.

2. పొరంబోకు, గౌటాన్ లావారిస్ భూములను, రైతుల పట్టా భూములను అన్యాయంగా ఆక్రమించడం :

ఆంజనేయ మాన్యం 3 గుంటలు, మఠమయ్య మాన్యం 3 గుంటలు, నీరడివాని కుంటకట్ట అర ఎకరం, గౌటాన్ భూమి అరఎకరము, మూసిపేట నారాయణ జాగ 2 గుంటలు, చిలమంతల కిష్టయ్య యింటి జాగ 2 గుంటలు, హను

యిండ్ల ప్రక్కజాగ 2 గుంటలు, పాంబండ రామయ్య జాగ 2 గుంటలు, వూసిగాని బొంద 5 గుంటలు, మాదిగ యిండ్లపంటి నిమ్మచెట్ల బావిజాగ 5 గుంటలు, కర్నె పోని కుంటకట్ట జాగ 5 గుంటలు ఆకుల వైకుంఠము జాగ అరగుంట, మర్రిగడ్డ అర యెకరము, శాల రామస్వామి జాగ 1 యెకరం, సనుబాల సోమయ్య 1 యెకరం, ఆలువాల భూమి పొలం 5 యెకరాలు, కుక్కలమడి 2 గుంటలు, ముచ్చాల రామగౌడ్ యింటి వెనుక చింతచెట్టు, 3 గుంటల పొరంబోకు భూమి, గౌటాన్ 2 యెకరాలు, లావారీస్ 4 యెకరాలు, ముచ్చాల రామాగౌడ్, దుగ్గి వీరయ్యల 10 గుంటల భూమి, బోయిని మల్లయ్య, కొట్టె నర్సయ్య ఇళ్ళమధ్య 2 గుంటల పొరంబోకును, చింతచెట్లను, హరిజనులు యిండ్ల ప్రక్కవున్న 5 గుంటల పొరంబోకు తదితర భూములను అక్రమంగా స్వాధీనం చేసుకున్నాడు. భూమి రెడ్డి 2 ఎకరము లను రూ. 800/-లకు రైను పెట్టుకొని 3 సం॥ తర్వాత స్వంతం చేసుకున్నాడు. శాలవాళ్ళ కొట్టం జాగలో కొట్టం కట్టుకున్నాడు. జంగం వీరయ్య 3 ఎకరాల మంచి భూమి తీసుకొని దానికి బదులు హరిజనులకు కేటాయించబడిన మల్కబాయి చెర్వు శిఖంను యిచ్చాడు. సీలింగులో పోయిన చెరువు ముందు కుంటక్రింద 2 ఎకరాల 6 గుంటల భూమిని 7 గురు హరిజనులకు కేటాయించి ప్రభుత్వం సర్టిఫికెట్‌లు యిచ్చినప్పటికి ఆ భూమిని ఇంతవరకు వారికి యివ్వకుండా తన స్వాధీనంలోనే వుంచుకున్నాడు. ఉప్పరోనికోలు 6 ఎకరమున సీలింగ్ భూమి 4 గురు హరిజనులకు కేటాయించగా, వారికి యివ్వకుండా తన స్వాధీనంలోనే వుంచుకున్నాడు.

3. విపరీత వడ్డీలకు అప్పులనిచ్చి దోపిడి చేయడం :

* నారాయణరెడ్డి సంవత్సరానికి 3 లక్షల రూ॥ల వరకు ప్రజలకు అధిక వడ్డీలతో అప్పులిచ్చి, దొంగ లెక్కలు వ్రాసి అధిక మొత్తంలో ప్రజల నుండి డబ్బులు గుంజుతాడు.
* శాల భూమయ్య చిన్న అల్లుడు, రాజీపేట శాల నర్సయ్యకు అర్థపల్ల బియ్యాన్ని రూ॰ 80/-లకు అప్పుగా యిచ్చి 4 సం॥ల తర్వాత 1200 లను అప్పుగా తేల్చి బలవంతంగా గుంజాడు.
* శాల భూమయ్య పెద్ద అల్లుడు లక్ష్మయ్యను నెలకు 30 రూపాయలతో జీతం ఉంచుకొని 10 సం॥ల తర్వాత యింకా 1000/-ల వరకు అప్పుగా తేలినది. అతని నుండి ఆ రూపాయలను బలవంతంగా వసూలు చేసినాడు.

* ఎరుకల ఎల్లయ్యను 10 సంవత్సరాలు పొట్టగంటికి జీతం వుంచుకొని తమ పని మానుకుంటానన్న రోజున రూ. 500/లను అప్పుగాతేల్చి అతని అర ఎకరం పొలం గుంజుకున్నాడు. యిప్పుడు తన పొలం తనకు యివ్వమని అడిగితే రూ. 500 లకు, 500 రూ॥లు మిత్తి కలిపి మొత్తం 1000 రూపాయలు ఇస్తే, తాను భూమి యిస్తానన్నాడు.
* చిలమంతల నాగయ్యకు రూ. 100/-లు 2-50 చొ॥ మిత్తికి యిచ్చాడు. సంవత్సరం తరువాత అసలు, మిత్తికలిపి మొత్తం రూ. 130లో నాగయ్య 100 రూపాయలు యిచ్చాడు. మిగిలిన 30 యివ్వలేదు. 6 సం॥ల తర్వాత దానిని 1200 రూపాయలుగాచేసి, బలవంతంగా గుంజుకున్నాడు.
* సత్తయ్యకు 120 రూపాయలు అప్పుగా యిచ్చి 7 సం॥ తర్వాత రూ. 3500 లు గుంజాడు.

4. అధికారాన్ని దుర్వినియోగ పరచడం :

* ఊరి సర్పంచ్ ఇతనే. సర్పంచ్ పదవిని ఉపయోగించి ప్రజలపై పెత్తనం, దోపిడీ చేయడం మొదలు పెట్టాడు.
* ఇంటిపన్ను 5 రూపాయలుంటే, ప్రజల దగ్గర రు. 50/-, 100/-, 500/-ల చొ॥న యింటిపన్నువసూలుచేసి ప్రతిసంవత్సరం రు. 10,000ల వరకు అక్రమంగా వసూలుచేసి దిగమింగాడు. ఇది అన్యాయమని ఎదిరించిన వారిని గుండాలచే తన్నించడం చేస్తున్నారు.
* గత 20 ఏండ్ల నుండి నీరడివానితో, మస్కూరివానితో తన యింటి పనులు చేయించుకుంటున్నాడు.
* ఊర్లోని ఏకోపాధ్యాయ పాఠశాలను నడవనీయకుండా చేశాడు. టీచరును బడిచెప్పొద్దని బెదిరించాడు. పాఠశాలలోని బండలను, సలాకులను ఎత్తుక పోయాడు.
* తనకు వ్యతిరేకులయిన వారిపై అక్రమంగా కేసులు పెట్టించి, పోలీసులకు పట్టించి, జుర్మానాలు వసూలు చేస్తున్నాడు.
* బ్యాగరి వీరయ్యతో సఫాయి పనిచేయించుకొని 10 సం॥లకు 10 రూపాయలు, రూ॥ 15 లు. రూ. 30ల చొ॥న, మొత్తం 30 సంవత్సరాలు పని చేయించుకొని అతని జీతం డబ్బులను ఎగగొట్టాడు. అతనికి పంచాయితీ ఆఫీసునుండి వచ్చిన రూ॥ 7000లను నారాయణరెడ్డి కాజేశాడు. ప్రస్తుతం కాళ్ళు, చేతులు పడిపోయి దిక్కులేని పరిస్థితిలో ఉన్నాడు.

5. ఇతర దోపిడి, దౌర్జన్యాలు :

* ప్రజల మధ్యన, అన్నతమ్ముల మధ్యన, తండ్రి కొడుకుల మధ్యన, మామ అల్లుల్ల మధ్యన, తగవు పెట్టి, ఒకరికి వ్యతిరేకంగా యింకొకరిని రెచ్చ గొట్టడం, పంచాయితీల పేరుతో జుర్మానాలువేసి గుంజడం, తనకు వ్యతిరేకు లయిన వారిని, తను పనికిపిలిస్తే రానివారి పశువులను, ఆస్తులను, ఇండ్లను, భూములను అక్రమంగా గుంజుకుంటున్నాడు. ఆ విధంగా తమ్మలి హనుమయ్య బర్రెను, మంగలి లసుమయ్య మేకను చంపాడు. తమ్మలి హనుమయ్య బండిని, వడ్లోల్ల ఆయిల్ ఇంజనును దొంగతనముగా ఎత్తుకపోయాడు.

కమ్మరి, కుమ్మరి, వడ్ల, చాకలి, మంగలి వాండ్లచే వెట్టి చేయించుకున్నాడు.

* కాజీపేట గ్రామచెరువు క్రింద నారాయణరెడ్డి భూములు, యితర రైతుల భూములున్నాయి. వర్షాకాలం పంటకు మాత్రమే తన భూములకు యితర రైతుల బూములకు చెరువునీరు వదులుతాడు. యాసంగి పంటకు మాత్రం తన ఒక్కని భూములకు నీరు వాడుకొని, యితరుల భూములను ఎండబెడ తాడు. ఆ విధంగా 50 మంది రైతులకు చెందిన 50 ఎకరాలు బీడుపడి పోయినాయి. ఈ విధంగా గత 20 సంవత్సరాల నుండి జరుగుతున్నది. వీడి బాధలు పడలేక చెరువుక్రింద భూమివున్న 9 మంది రైతులు తమ 20 ఎక రాల భూమిని వదిలిపెట్టి వెళ్ళిపోయారు. యిప్పుడు వర్షాకాలం పంటకు కూడా నీళ్ళు వదలకుండా చేస్తూ రైతులకు అనేక యిబ్బందులకు గురి చేస్తున్నాడు.

* ఊరి కోమట్ల దగ్గర తన యింటికి అవసరమయిన సరకులను తెచ్చుకొని గత 10 సం॥ల నుండి డబ్బులను ఎగ్గొట్టాడు.

* తన జీతగాళ్ళకు సంవత్సరానికి అతి తక్కువ జీతం రూ॥ 900 లు యిస్తూ (చుట్టుప్రక్క గ్రామాల్లో రూ. 1500 లు ఉన్నాయి) దోపిడీ చేస్తున్నాడు.

* ఊర్లోని 50 మంది రైతులు చెలకలలోని రూ. 40,000/–లు విలువచేసే 50 వేపచెట్లను అన్యాయంగా కొట్టుకొని, కలపను అమ్ముచున్నాడు.

* ప్రభుత్వ అధికారులను ఎవ్వరిని తన ఊరికి రానివ్వడు. ఒకవేళ వచ్చినా తాను చెప్పినట్లు వినాల్సిందే. ఒకసారి ఊర్లోకి వచ్చిన ప్రభుత్వ లారీని తగుల పెట్టాడు.
* గోపిశెట్టి వీరేశం, అతని తండ్రి నారాయణకు మధ్య తగువుపెట్టి 10 ఎకరముల భూమిని, ఇండ్లను స్వాధీనం చేసుకొని వీరేశానికి ఇల్లు లేకుండా చేశాడు.
* ఊరిలోని స్త్రీలను చెరచడం, నోటికొచ్చినట్లు తిట్టడం, కొట్టడం జరుగుతుంది.
* తన పార్ట్‌నర్ అయిన దడువై కిష్టయ్యను అన్యాయంగా వెళ్ళగొట్టి షుగర్ ఫ్యాక్టరీని తానే స్వాధీనం చేసుకున్నాడు.
* గౌలపల్ల సత్తయ్య, సారపెద్ద సత్తయ షాపుద్దీన్ వంటి 10,20 మంది గూండాలను ప్రోగుచేసి, వారికి త్రాగించి, తినిపించి తనకు వ్యతిరేకులయిన వారిపై దాడులు చేయడం, వారి యిండ్లను, ఆస్తులను ధ్వంసం చేయడం చేస్తున్నాడు.

## మల్లారెడ్డి దోపిడి దౌర్జన్యాలు

వీడు మొదట కొండపూర్‌కు దత్తతకుపోయి అక్కడ ఆస్తినంత అమ్మి డబ్బులు ప్రోగుచేసికొని, తిరిగి కాజీపేట గ్రామానికివచ్చి రాజిపేట శివారు భూములకు (తన తండ్రి ఆస్తి) వారసుడయ్యాడు. వీడు రాజిపేటలో గత 10 సం।। వరకు మాలీపటేల్‌తనం చేశాడు. ఇది కూడా బలవంతంగా ఒక బల్జ అతని నుండి గుంజుకున్నాడు. రాజిపేట గ్రామ డీలర్‌షిప్ తానే సంపాదించి గ్రామ కోటాను అంతటిని ప్రజల కివ్వకుండా అమ్ముకునేవాడు. తుజాల్‌పూరం కోమట్ల దగ్గర అప్పులు తీసుకొని ఎగకొట్టినాడు. రాజిపేట బల్జతని బూమి కోమటతని భూమి కలిపి మొత్తం 30 ఎకరాలను అన్యాయంగా ఆక్రమించుకున్నాడు. సీలింగ్‌లో పోయిన తన భూములను ప్రభుత్వము హరిజనులకు కేటాయించి సర్టిఫికెట్లు ఇచ్చినప్పటికి వారి నుండి అన్యాయంగా డబ్బులను గుంజి భూములను ఇచ్చాడు. ఆ విధంగా తోకచెలక 2 ఎకరాల సీలింగు భూమి నీరడి మయినయ్యకు కేటాయించగా అతని నుండి రూ।। 2000/-లను బలవంతంగా వసూలుచేసి భూమి ఇచ్చాడు. కాలివేరిగడ్డ 2 ఎకరాల సీలింగు భూమి బోయినపల్లి బాలయ్యకు కేటాయించగా అతని నుండి 1200/-లు అక్ర

షంగా వసూలుచేశాడు. కాజీపేట పోస్టుమాష్టరుగా ఉంటు తనకు వ్యతిరేకులయిన ప్రజల ఉత్తరాలను చదవడం చింపివేయడంవంటి దుర్మార్గాలకు పాల్పడుతున్నాడు. పోస్టాపీసులో ఉన్న ప్రభుత్వ ఫోనును తన స్వంత పనులకు వాడుకొంటున్నాడు. వీడు తన అన్న నారాయణరెడ్డికి కుడిభుజంగా ఉంటు ప్రజలపై గుండా చర్యలకు, దౌర్జన్యాలకు పాల్పడుతు ఉన్నాడు. స్త్రీలను చెరచడం వంటి కిరాతక చర్యలను కొనసాగిస్తున్నాడు.

కాజీపేట, తుజాల్‌పూర్, రాజిపేట,

లింగపురం గ్రామాల పేద ప్రజలారా!

అనేక సంవత్సరాలుగా మనపై కాజీపేట దొరలు చేస్తున్న దోపిడి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడాలి. తమ అధికార బలంతో, ధనబలంతో మనపై గుండా చర్యలకు పాలుపడుతూ మనలను అనేక విధాల బాధలకు గురిచేస్తున్న కాజీపేట దొరల దుర్మార్గాలను అంత మొందించాలి. మనమంతా ఒక త్రాటి మీద నిలబడి ఈ దుర్మార్గపు దొరల దౌర్జన్యాలను సమాధి చెయ్యాలి. మన అనైక్యత, అజ్ఞానం, అమాయకత, భయంవల్లనే దొరలు మనలను దోపిడీ చేస్తున్నారు. మనము భయాలను పారద్రోలి ఐకమత్యంగా సంఘటితమై దొరల దోపిడీని ఎదిరిద్దాం. ఈ పోరాటంలో మనం ఒంటరిగా లేము అశేష ఆంధ్రరాష్ట్ర పీడిత రైతాంగం మన వెంట ఉన్నారు. ఒకప్పుడు కరీంనగర్, అదిలాబాద్, వరంగల్, నిజామాబాద్, ఖమ్మం జిల్లాలలోని పీడిత రైతాంగాన్ని అక్కడి దొరలు తమ దోపిడీ, దౌర్జన్యాల ద్వారా అనేక బాధలకు గురిచేశారు. వారు ఈరోజు ఎక్కడికక్కడ సంఘాలు పెట్టుకొని పోరాడిన ఫలితంగా దొరల దోపిడీని అంత మొందించారు. వెట్టి చాకిరిని రద్దు చేసుకున్నారు. భూస్వాములు అక్రమంగా గుంజుకొన్న భూములను తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ధరావతుల పేరుతో, జుర్మానాల పేరుతో, పైరవీల పేరుతో ప్రజల నుండి దొరలు అక్రమంగా వసూలు చేసిన లక్షలాది డబ్బును తిరిగి దొరల నుండి రాబట్టారు. భూమిలేని పేద రైతాంగం, వ్యవసాయ కూలీలు వందల ఎకరాల పోరంబోకు, బంచరాయి భూములను స్వాధీనం చేసుకొని దున్నుకొంటున్నారు. దొరలకు గ్రామ ప్రజలందరు పనులు బంద పెట్టి వారి అధికారాన్ని గ్రామాలలో అంత మొందించారు. ఎదురు తిరిగిన భూస్వాములను దెబ్బతీశారు దొరల గుండాలకు

దేహశుద్ధి చేసి బుద్ధిచెప్పారు. ఈ రోజు అక్కడ గ్రామ అధికారం అంతా ప్రజలది, రైతుకూలి సంఘాలదే. మనం కూడా కరీంనగర్, అదిలాబాద్, వరంగల్, నిజామాబాద్, ఖమ్మం తదితర జిల్లాలలోని పోరాడుతున్న రైతన్నల మార్గంలోనే సంఘటితమై కాజీపేట దొరల దోపిడి, దౌర్జన్యాలను ఎదిరిద్దాం. మనకు మేలు చేయడానికి ఎవరో వస్తారని ఎదురుచూసి మోసపోవద్దు. మనసమస్యల పరిష్కారానికి మనమే సంఘటితమై సంఘాలు పెట్టుకొని పోరాడాలి. ఈ ప్రభుత్వాలు, ఈ దోపిడీ పార్టీలు గ్రామ గ్రామాన ఉన్న కాజీపేట దొరల వంటి వారిని కాపాడటమే లక్ష్యంగా పెట్టుకున్నారు. అందుకే మనము కాజీపేట దొరలు చేస్తున్న దోపిడి, దౌర్జన్యాలపై యెన్నోసార్లు ప్రభుత్వ అధికారులకు చేసుకున్న విజ్ఞప్తులన్ని వృధా అయ్యాయి. ఎన్నికల పార్టీలు ఎన్నికలప్పుడు ఓట్లు వేయించుకొని పట్నానికి పోయి సీట్లకు, పదవులకు ఆశపడుతున్నారు తప్ప ప్రజల మౌలిక సమస్యలను వేటినీ పట్టించుకొనడం లేదు. అందుకని ఈ భూస్వాముల దొరల ప్రభుత్వాన్ని కార్మికవర్గ నాయకత్వాన దున్నేవానికే భూమి చెందాలనే నినాదంతో పోరాటం చేసి కూల్చడం ద్వారా రైతుకూలి రాజ్యాన్ని ఏర్పాటు చేసుకోవాలి. అప్పుడే మనం పడుతున్న బాధలు పరిష్కారం అవుతాయి. ఇంతకన్నా మనకు దగ్గర మార్గంలేదు. రోజురోజుకు దొరల దోపిడీకి, దొరల గుండాల దాడులకు గురిఅవుతు మన భూములను ఇండ్లను ఆస్తులను పోగొట్టుకొని మన స్త్రీలకు పిల్లలకు రక్షణ లేకుండా దిన మొక గండంగా గడిపే కన్న అందరం ఐక్యంగా పోరాడడం ద్వారానే దొరల దోపిడీ, దౌర్జన్యాలనుండి రక్షించుకుంటూ, మన పరిస్థితులను బాగుచేసుకోగలం. ఈ క్రింది కోర్కెలపై పోరాడటానికి సంసిద్ధము అవుదాం. తెగించి పోరాడుదాం. విజయంమనదే.

* కాజీపేట, తుజాల్‌పూర్, రాజిపేట, లింగాపూర్ ప్రజలపై కాజిపేట దొరలు చేస్తున్న దోపిడి, దౌర్జన్యాలను, గుండాల దాడులను వెంటనే ఆపుచెయ్యాలి.
* కాజీపేట దొరలు ప్రజలనుండి అన్యాయంగా గుంజుకున్న భూములను, ఇండ్లను బేషరతుగా ఎవరికి వారికి తిరిగి ఇచ్చివేయాలి.
* కాజిపేట దొరలు అన్యాయంగా ఆక్రమించిన పొరంబోకు, లావారీస్, గౌటాన్ భూములను భూమి లేని పేదరైతు వ్యవసాయ కూలీలకు పంచాలి.
* కాజిపేట, తుజాల్‌పూర్, రాజిపేట, లింగాపూర్, మంతూర్ గ్రామప్రజల నుండి పైరవీల పేరుతో జుర్మానాల పేరుతో, ఇతరత్రి పేర్లతో కాజిపేట దొరలు అక్రమంగా వసూలు చేసిన డబ్బును తిరిగి ఇవ్వాలి.

* సీలింగ్ భూములను ప్రభుత్వం కేటాయించిన వారికి వెంటనే స్వాధీనం చెయ్యాలి. సీలింగ్ భూముల విషయాల్లో వసూలుచేసిన డబ్బులను తిరిగి వాపసు ఇవ్వాలి.
* ఊరిలోని చింత చెట్లు, మామిడి చెట్లు, వేపచెట్లు, గ్రామ ఉమ్మడి ఆస్తిగా చేయాలి.
* 50 మంది రైతులు 50 వేప చెట్లను అన్యాయంగా నరికి అమ్ముకొని తిన్న డబ్బులను తిరిగి ఇవ్వాలి.
* చెరువు క్రింద ఉన్న భూములన్నింటిని చెరువు నీరును రెండు పంటలకు సరిసమానంగా అందరికి పంచాలి.
* దొంగ లెక్కలతో ప్రజలనుండి అధిక మొత్తంలో వసూలు చేసిన అప్పులను తిరిగి వాపసు ఇవ్వాలి.
* మల్లారెడ్డికి ఉన్న పోస్టుమాస్టర్ ఉద్యోగాన్ని వెంటనే రద్దుచేయాలి.
* వెట్టి చాకిరీని రద్దు చేయాలి.

విద్యార్థి, యువజనులారా! ప్రజాస్వామికవాదులారా!

కాజీపేట, తుజాల్‌పూర్, రాజిపేట, లింగాపురం గ్రామాల ప్రజలపై కాజీపేట దొరలు చేస్తున్న దోపిడి దౌర్జన్యాలను గుండాల దాడులను ఖండించండి. కాజీపేట దొరల దోపిడి, పీడనలకు వ్యతిరేకంగా పోరాడుతున్న పై గ్రామ ప్రజల న్యాయమయిన పోరాటానికి మద్దతునివ్వండి.

— కాజీపేట దొరల దోపిడి, దౌర్జన్యం నశించాలి.
— నూతన ప్రజాస్వామిక విప్లవం వర్ధిల్లాలి.
— దున్నేవానికి భూమి చెందాలి.
— రైతుకూలి సంఘం వర్ధిల్లాలి.

తేది 8–9–1984 రైతుకూలీ సంఘం, రాడికల్ యువజన సంఘం

నర్సాపూర్ తాలూకా మెదక్ జిల్లా,

(4 వ పేజీ తరువాయి)

రాడికల్స్‌ను గ్రామాలకు రానివ్వొద్దని గ్రామాలకు కాపలాలు కాస్తున్నారు. సాయుధ ప్రదర్శనలు చేస్తున్నారు. ప్రజలను కూడా కావలా కాయమని నిర్బంధిస్తున్నారు. కావలాకు రాకపోతే తప్పులువేసి వసూలు చేస్తున్నారు. దిబ్బగూడెం మాదిగ యువకులు సినిమాకు వెళ్ళినా ఏలూరు టౌనుకు వెళ్ళినా బంధించి గంటలతరబడి ఎండలో వానలో నిలబెడుతూ నానా విధాల హింసిస్తున్నారు. దీనికంతటికి నాయకత్వం వహిస్తున్నవాడు, "ఎస్. పి. నా చేతిలోని మనిషి. ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాడు. అవసరమైతే తుపాకి తీసుకొస్తాడు. నలుగుర్ని చంపినా నన్నెవరూ ఏమీ చేయలేరు" అని సవాల్ చేసాడు. మండూరు చెరువులో తనకు పట్టా వచ్చిందని చెరువుశికం భూమి ఆక్రమించాడు. ముండూరు హరిజనులు ఆ గట్లు చిమ్మివేశారు.

వాటికన్నిటికీ పరాకాష్టగా ఆర్.డి.ఓ విచారణ కోసం ప్రజల్ని సమీకరిస్తున్న రాడికల్ విద్యార్థి, యువజనులను జూలై 14వ ఇద్దరు భూస్వాముల నాయకత్వంలో వందమంది గూండాలు అడ్డగించారు. దిబ్బగూడెం రమ్మన్నారు "మాకు అక్కడికి వచ్చే కార్యక్రమం లేద"ంటే బలవంతంగా తాళ్ళతో కట్టి కొడ్తూ కర్రలతో నెడ్తూ దిబ్బగూడెం తీసుకొనివచ్చి ఖోరునకురుస్తున్న వర్షంలో నిలబెట్టి తలా ఒక దెబ్బ కొడ్తున్నారు. ఇంతలో అక్కడికి చేరుకున్న మరొక భూస్వామి "ఈ లంజలను ఇట్లాకాదు. ఆ మాదిగ లంజలతోనే కొట్టిద్దాం" అని ఇద్దరు మహిళా కామ్రేడ్స్‌ను మాదిగగూడెం స్కూల్లోకి తీసుకొనివెళ్ళి వారిని కొట్టమని హరిజనులకు ఆజ్ఞాపించాడు. వారు కొట్టక పోవడంతో వారిని నానా తిట్లూ తిట్టి మీ సంగతి తర్వాత చూస్తామని వీరిని గొల్లగూడెం స్కూల్‌కి తీసుకొచ్చారు. అక్కడ తలుపులన్నీ బంధించి ఈ ఇద్దరు మహిళా కామ్రేడ్స్‌ను నానాబూతులు తిడ్తూ చేతులతోనూ చెప్పులతోనూ కర్రలతోనూ ముఖం మీద, రొమ్ములమీద, పొత్తికడుపులో వివరీతంగా కొట్టారు, పొడిచారు. దెబ్బ బయటకు కనపడకుండా కర్రలతో పొడిచెయ్యమని భూస్వామి ఇచ్చిన సూచనను అనుసరించి అత్యంత పైశాచికంగా ఇద్దరిపై దాడి చేశారు. మీరు లంజలు రాడికల్స్ అంతా మీకు మొగుళ్ళు అందరితో పోతున్నారు. మాతోకూడా ఎందుకురారు. మిమ్మల్నిప్పుడు రేప్‌చేస్తాం. మీకు దిక్కెవరు అని ఒకటేమిటి, ఇక్కడ వివరించటానికి వీలులేనన్ని బూతులు తిట్టారు. మూడు నాలుగు గంటలపాటు సాగిన ఈ పైశాచిక కరాళ నృత్యంతో ఒక కామ్రేడ్ సొమ్మసిల్లి

వడిపోయింది. అప్పుడు పోలీసులు రంగప్రవేశం చేసి  దెబ్బలు తిన్న ఈ ఏడుగురు కామ్రేడ్స్‌ను అరెస్టు చేశారు. ఇదేమి అన్యాయం అని అడిగిన హరిజన దంపతులను కూడా కలిపి జీపులలో కుక్కి  తీసుకొనివచ్చి ఎలాంటి ట్రీట్ మెంట్  ఇవ్వకుండా మూడ్రోజులపాటు లాకప్పులో అక్రమంగా నిర్బంధించి వీరే భూస్వామి యింటిమీదికి దౌర్జన్యానికి వెళ్ళినట్లు తప్పుడు కేసు బనాయించి కోర్టులో హాజరుపరచారు.

ఈ అన్యాయం గురించి డిఎస్పీ దగ్గరకు పోతే  అక్కడ  ముందుగానే ఈ దౌర్జన్యం చేసిన భూస్వాములు ప్రత్యక్షం. జులై 16న ప్రదర్శనకు సిఐ అనుమతి నిరాకరించడమే కాదు. ప్రదర్శన  జరిగితే తీవ్ర పరిణామాలుంటాయని  హెచ్చరించాడు. భూస్వాములు అమానుషంగా కొట్టారని ఎ ఎస్సైకి చెప్తే "కొట్టారా ? కొట్టక ఏం చేస్తారు." అని సమాధానం చెప్పాడు. ఆ రోజునుండి ప్రతిరోజూ  పెదవేగి గ్రామ ప్రజల మీదనే పోలీసుదాడులు మొదలయ్యాయి. తాలూకా సి.ఐ జీపులో భూస్వామిని ఎక్కించుకొని "అతడు దేముడు,  అతని నాయకత్వంలో మీరంతా ఉండాలి. రాడికల్స్‌తో సంబంధాలు పెట్టుకుంటే సహించం" అని ప్రజలకు హెచ్చరిక చేసి వెళ్ళాడు.

అయినా జూలై 16 న ఈ ఇద్దరు భూస్వాముల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజలు గొప్ప ప్రజా ప్రదర్శన చేసారు.

గత మూడు సంవత్సరాల పెదవేగి రైతాంగ పోరాటంపై ముఖ్యంగా మూడు
న్నర నెలలుగా  సాగుతున్న భూస్వాముల,  వారి గూండాల,  పోలీసుల దౌర్జన్యా
నికి వేగివేగి ప్రజలు ఇక వేగలేక........

30–10–'84

---

## సవరణ

అక్టోబరు సృజన 29 వ పేజీలో ప్రకటన ఇలా చదువుకోవాలి.

సృజన ప్రచురణ !!

వెలువడింది !

ఎన్నెలలో......

**భూపాల్ పాటలు**

వెల : 3 రూపాయలు

ప్రతులకు : సృజన, హనుమకొండ - 506 001

---

(2వ కవరు పేజీ తరువాయి)

**SRJANA Telugu Monthly** **November' 84 H/HNK-3**
Regd, No. with Registrar of Newspapers 10953/67

# ఆర్థికంగా, హార్దికంగా సృజనకు సహకరించండి.

న్యూస్‌ప్రింట్ కొరతవుండదు – అని కేంద్రప్రభుత్వ ప్రకటనలు రోజూ వస్తూనేవున్నాయి. న్యూస్‌ప్రింట్ రేట్లు 1980 జనవరినుంచి 84 జులై నాటికి 60–65 రూపాయలనుంచి 105–120 రూపాయలదాకా [సింగిల్ రీమ్‌కు] పెరిగింది. అందువల్ల దిన పత్రికలతో సహా దేశంలోని పత్రికలన్నీ రేట్లు పెంచక తప్పలేదు.

18 సంవత్సరాల జీవితంలో (మాసపత్రికగా 14 సంవత్సరాలు) కేవలం 1977 నుంచి '79 దాకా మాత్రమే సృజనకు న్యూస్‌ప్రింట్ కేటాయించబడింది. ఎమర్జెన్సీలో మినహా పత్రిక ఎప్పుడూ ఆగిపోలేదు. అయినా ఇందిరాపాలనలో సృజన కెప్పుడూ న్యూస్‌ప్రింట్ కోటాలేదు పైగా 80 జనవరినుంచి న్యూస్‌ప్రింట్ రేటు విపరీతంగా పెరుగుతున్నది.

ఈ మధ్యకాలంలో పోస్టేజిరేట్లు, ప్యాకింగు సామాగ్రిరేట్లు విపరీతంగా పెరిగిపోయాయి. ప్రింటింగుచార్జీలు, బ్లాక్ మేకింగుచార్జీలు కూడ రెట్టింపయ్యాయి. కేవలం నవత ప్రింటింగ్ ప్రెస్, వరంగల్ సహకారంవల్ల మాత్రమే నాలుగున్నర సంవత్సరాలుగా సృజన చందారేటు పెంచకుండా ఎన్ని ఆటుపోటులు వచ్చినా నడువగలుగుతున్నది. ఏతొందరవుండో, ఇబ్బందివుండో హైదరాబాదు, విజయవాడలలో ముద్రించవలసివచ్చినా ఎంత ఇమ్మడి ఖర్చవుతున్నదో 84 జనవరి సంచిక అనుభవం పాఠకులు చదివే వుంటారు.

ఈ రెట్టింపయిన అన్ని రకాల ఖర్చులతోడు బకాయిలు పేరుకొనిపోతున్న ఏజెంట్ల వైఖరి: తమకు కావలసిన కాపీలకు అడ్వాన్సు పంపడం అనే ఖచ్చితమైన పద్ధతితో ప్రారంభమై క్రమంగా వందల రూపాయల బకాయి దగ్గర ఘనీభవిస్తుంది. అట్లాగే చాలామంది చందాదార్లు చందా అయిపోయినా, సృజన రిమైండర్సు అందుకున్నా, రెన్యూ చేయించే శ్రద్ధవుండదు. ఈ అన్ని కారణాలతో సృజన నెలకు వెయ్యి రూపాయల నష్టంతో నడుస్తున్నది.

1. ఏజెంట్లు బకాయీలు చెల్లించి క్రమం తప్పకుండా సృజన తెప్పించే బాధ్యత ఆయా ప్రాంతాల్లో పాఠకులే తీసుకోవాలి లేదా సృజన పాఠకుల సర్కిల్స్ ఏర్పాటు చేసుకొని ఒకరి పూచీ మీద తెప్పించుకోవాలి
2. ఏజెంట్ల మీద ఆధారపడకుండా ఎక్కువగా చందాదార్లను చేర్పించాలి.
3. మీకు తోచిన రీతిలో ఆర్థిక సహాయం చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

— 'సాహితీమిత్రులు'

SRJANA
Hanumakonda 506001

This issue Rs. 2-00
Yearly Subscription Rs. 20-00